# కడిమిచెట్టు

( చరిత్రాత్మక నవల )

గ్రంథకర్త

విశ్వనాథ సత్యనారాయణ, ఎం. ఏ.

1958

ప్రకాశకులు

పి. ఆర్. అండ్ సన్సు, విజయవాడ.

# కడిమిచెట్టు

[ చరిత్రాత్మక నవల ]

గ్రంథకర్త

విశ్వనాథ సత్యనారాయణ, ఎం. ఏ.

1958

ప్రకాశకులు

పి. ఆర్. అండ్ సన్సు, విజయవాడ.

# ఆంధ్ర కేసరికి

## పుట్టినరోజు కానుక

ఆగస్టు : 23, 1946

బొడున్ నొక్కి 'తలం గదల్పఁగస్వతంత్రాంధ్రక్షమామంత్రలే
నాఁడో ? నేఁడు ప్రకాశ'మయ్యె మఱలన్ గాదన్న స్వాతంత్ర్యమే
నేఁడో తేపొ ! స్వతంత్రతాచటుల గాండీవంబు సారించు స
మ్రాడౌజ్జ్వల్యమహఃపయోనిధి, జగామాందాళియౌ జహ్వారున్.

ఇన్ని కష్టములయి యెన్నాళ్ళ కెన్నాళ్ళ
కేన్ స్వతంత్రతాప్తి యెసఁగె నంచు
నబ్బురము, ప్రధాని డెబ్బదియైదేండ్ల
సాక్ష్యమిచ్చు శౌర్యసామిధేని.

ఈ కథ స్వతంత్రతాకథ
నీ కథయు స్వతంత్రతామనీషాకథయే
యీ కానుక యాంధ్ర ధరి
త్రీకోమలభావరేఖ తెచ్చిన గురుతై.

మదరాసు,
23-8-46.

విశ్వనాథ సత్యనారాయణ.

# పీఠిక

~~~~~★~~~~

ఇది చరిత్రాత్మక నవల. దక్షిణాపథ పూర్వరాజ చరిత్రలోఁ గదంబవంశమని యొకటి కలదు. చారిత్రకులు కదంబవంశమునుగూర్చి వ్రాయుచు నిట్టికథ యొకటి యున్నదని చెప్పుదురు. ఆ కథ నాధారము చేసికొని యీ నవల వ్రాసితిని.

ఇది ప్రత్యేకముగా విద్యార్థులను మనసులోఁ బెట్టుకొని వ్రాసితిని. మన దేశచరిత్రయు, దత్సంబంధమైన యుత్సాహమును వారికిఁ గలిగించు నూహతో నీ ప్రయత్నము చేసితిని.

మఱియు నాంధ్రవచనరచన తెలుఁగు పలుకుబడికి దూరముగా నుండి యెక్కువభాగము కృతకముగా నుండుచున్నది. మన మహా వాక్యములయందుఁగూడ గథాంశమునందుఁ 'బ్రసంగ' సంబంధము నందు, మహాకవు లెప్పుడును దెలుఁగు పలుకుబడిని వదలిపెట్టలేదు. తెలుఁగు పలుకుబడిని వదలిపెట్టిన కావ్యభాషను జూచి చాలమంది తెలుఁగువారే భయపడుదురు. ఆకావ్యభాష నిజమైన భాషయని, తాము దైనందినముగా మాటాడు తెనుఁగుభాష భాష కాదని, చాలమంది యాంగ్లభాషావిశారదులైన తెనుఁగువారు తమకుఁ దెనుఁగుభాష రాదను కొందురు. ఇది పొరపాటు.
~~~~~

ఇట్టి భావమే కృతకవచనరచన చదివింపఁబడిన విద్యార్థులును గలిగియుందురు. ఈ గ్రంథములోని వచనము మనము మాటాడుకొను నట్లే యుండును. శబ్దము చ్యుతసంస్కారము కాకుండ నుండవలయును. అన్వయము మొదలైనవి మనము మాటాడుకొనుటలో నున్నవి. ఇట్టి గ్రంథములు విద్యార్థులు చదివినచో వారు తమ మాతృభాషను దా మెఱుఁగుదురు. తమకుఁ దెలిసినభాష, తమకు వచ్చినభాష నిర్దుష్టముగా వ్రాసినచో నది భాష యగునని, యది యొక వ్యాస మగునని వారికి ధైర్యము సమకూరును. అందుకై యీ ప్రయత్నము.

బెజవాడ,
28-8-46.

విశ్వనాథ సత్యనారాయణ.

# విషయసూచిక

# ప్రథమాధ్యాయము

ఆకడిమిచెట్టు దినదినము శుక్లపక్షచంద్రునివలెఁ బెరుగు చుండెను. శుక్లపక్షములోఁ జంద్రుఁడు దినదినాభివృద్ధిఁ గాంచుటకు నతని నెవరు పోషించుచుండిరో, యెవ రతనికిఁ బాలిచ్చు చుండిరో, దినమున కెంత పెరిగెనా యని యెవరు పరీక్షించు చుండిరో తెలియదు. కాని యీకడిమిచెట్టునకుఁ బ్రతిదినమును నీరు పోసెడివారు కలరు. పాదులోఁ బడిన చెత్తనంతయును దీసి వేసెడివారు కలరు. పాదులో మంచితీర్థము పోసెడివారు కలరు. ప్రొద్దుననే లేచి 'యిదిగో మన కడిమిచెట్టు. క్రొత్తరెమ్మ వేసినది. క్రొత్తచిగురు తొడిగినది. క్రొత్తపూవు పూచినది' యని చెప్పుకొనువారు కలరు. కడిమిచెట్టునకు సంస్కృతము కదంబ వృక్షము. ఆవృక్షము పెరిగి నాలుగైదు శాఖలు వదలి మొక్కయనిపించుకొనుట మాని చెట్టనిపించుకొనుచున్నది. ఇప్పుడు సమృద్ధిగాఁ బూఁచుచున్నది. ఆకడిమిపూఁత రాత్రులందా యింటివారికిమాత్రమే కాదు. ఇరుగుపొరుగువా రందఱను ఘ్రాణతర్పణముగఁ జల్లని పిల్లగాలులవీపులమీఁద నెక్కి పేరంటములకుఁ బిలిచివచ్చును. ఈకడిమిపూఁబిలుపునకు వచ్చెడు



వారు పేరంటాండ్రుకారు. పురుషులైన వృద్ధులు. వారైదారు గురు వత్తురు. ఆ చెట్టుక్రిందఁ గూర్చుండురు. ఆగృహాయజమానియు వచ్చును. అందఱును గూర్చుండి యూరిలోని వార్తలన్నియుఁ జెప్పికొందురు. వీ రిట్లు మాటాడుచుండఁగ నొక యెనిమిదేండ్ల బాలుఁ డింటిలోనుండి వచ్చి తాతగారితొడ మీఁదఁ గూర్చుండును. ఇరుగుపొరుగు ముసలివారు వానిని దమ

వద్దకు ర మ్మందురు. వాఁడు పోఁడు. 'మీవానిదగ్గర మిక్కిలి రాచఠీవి కల' దని యెవరో యొక ముసలివాఁ డనును. తాత నవ్వును. కుబ్జవానికిఁ గోపము వచ్చును. వాఁడు తాతగారితొడ మీఁద నుండి దిగి తర్జనితో ముసలివారిని బెదరించుచు మఱల లోనికిఁ బోవును. ఆఱుగురుముసలివాండ్రును గలిసి బోసినవ్వులు నవ్వుదురు. కడిమిచెట్టు పూఁచినపూఁత తెల్లగా వెన్నెలలను బరిహసించును. క్రింది యీబోసినవ్వు లా వెన్నెలలను, నీకడిమి పూఁతను బరిహసించును. ఆవృద్ధుల బోసినవ్వులు విచిత్రము లైనవి. కాలము వృథాగా గడచిపోయినట్లు చూపించును. ఆనవ్వులలో నున్న యాపసివానియందలి యనురాగము క్రొత్తకాలమునందలి యౌవనదశనుగూడఁ బ్రదర్శించును. పసి వాండ్ర లేఁతనవ్వులు సన్నజాజి మొగ్గదొడిగిన ట్లుండవచ్చును. నూతనప్రణయవంతుల నవ్వులు శరత్కాలపూర్ణిమాచంద్ర మండలకాంతిఁ బురుడించవచ్చును. పసివాండ్రను జూచి యానందించు ముసలివాండ్ర బోసినవ్వులు కాలములోని సర్వ దశలను విచిత్రముగాఁ బ్రకాశింపఁజేయును.

అందఱు నవ్వు లాపినతరువాత మఱల నాతాతగారు మనుమని బిలుచును 'మయూరా! మయూరా!' యని. మయూరుఁడు మఱల వచ్చును. మయూరునికనులు పెద్దవి. ముక్కు వంపుతీరి సంపెంగరేఖవలె నుండును. కన్ను లాకర్ణాంత విశాలములు. ఫాలభాగము మిక్కిలి విశాలము. ఎనిమిదేండ్ల పసిబాలు నిట్లు వర్ణించుట న్యాయమా యనిపించును. కాని, యా కుబ్జవానిలో నేదో మహారాజరేఖ యున్నది. ఆవృద్ధు

లందఱుఁ జనవుచేతఁ, బ్రేమచేత నాకుఱ్ఱవాని ముఖసౌందర్యమే చూతురుగాని యతని తేజశ్శాలితఁ జూడరు. ఈకుఱ్ఱవానిలో మఱొకవిలక్షణ మున్నది. అతనికిఁ గోపము వచ్చినచో నంత పసివానికోపము ప్రచండముగా నుండును. పసివాఁడగుటచేత నాకోపప్రాకట్యము జనులకు నిరాదరణహేతువు కావచ్చును. వస్తుతత్త్వముచేతఁ జూచినచో నాకోపము ప్రళయరుద్రుండుగూ సదృశ మైనది. ఈసంగతి గుర్తుపట్టిన దాతని తాతగా రొక్కరే.

ఒకనాఁడు వృద్ధులపరిషత్తు ప్రొద్దు క్రుంకకముందే సమకూడెను. ఆగ్రామముపేరు స్థానాకోడూరు. ఈగ్రామము శాతవాహనరాజ్యములోనిది. శాతవాహనుల బలము తగ్గి చాలదినము లైనది. ధాన్యకటకమునందు శాతవాహనసామ్రాజ్యము సన్నగిల్లిన తరువాత వారి సామంతు లిక్ష్వాకులు విజయపురిని రాజధానిగాఁ జేసికొని చక్రవర్తులై యాంధ్రదేశమంతయుఁ బాలించుచు వచ్చిరి. బాహుబలశాంతిమూలచక్రవర్తి యనంతరమున నిక్ష్వాకుల పరాక్రమాతిశయములు దగ్గిపోఁజొచ్చెను. దక్షిణమునఁ బల్లవచక్రవర్తుల ప్రాబల్యము హెచ్చెను. పల్లవరాజు శివస్కందవర్మ బాహుప్రతాపశాలియై విజృంభించుచుండెను. ఆపల్లవరాజుల దాడులు తెలుఁగుఁ దేశమున శాతవాహనరాష్ట్రమున లెక్కకు మిక్కిలి కాఁజొచ్చెను. ఆటవికసైన్యము తెలుఁగురాష్ట్రమున వదలఁబడెను. ఈయాటవికులు తెలుఁగుపొలిమేరలు దాఁటి శాతవాహనరాష్ట్రమునందలి పల్లెలుకూడఁ గొల్లగొట్టఁజొచ్చిరి. దినదినము పల్లవసైన్య 'మాయూరు దోచెఁను', 'ఈయూరు తగులఁ బెట్టె' నన్న వార్తలే

వచ్చుచుండెను. బలమఱియైన నిక్ష్వాకుచక్రవర్తులు చేసినచో మహాయుద్ధములు చేయవచ్చును. గెలుచుటయో, యోడుటయో తేల్చుకొనవచ్చును. అట్లు కాక చిన్నచిన్న దళములతోఁ జెదరి



పోయిన పల్లవసైన్యము నెదిరించి సంహరించుచు వచ్చిరి. ఇది కోపముగఁ బల్లవచక్రవర్తి యాటవికసైన్యమును శాతవాహన రాష్ట్రముమీఁద వదలెను. వారూళ్ళు దోఁతురు. తగులఁబెట్టుదురు. స్త్రీల మానభంగము కావింతురు. అందుచేత నారాష్ట్ర మంతయు గగ్గోలుగా నుండెను.

ఆనాఁ డన్ని గ్రామములచుట్టును జివరకు మట్టితోనైన నొకగోడ యుండెడిది. గ్రామములోనికిఁ బోవుట కొక్కటే త్రోవ. స్థానాకోడూరుకుఁగూడ నట్టిగోడ చుట్టును గలదు. ఆగ్రామములోని యువకులు గోడలపైకి నిచ్చెనలతోఁ బోయి తమకు సాధ్యమైనంతవఱకు దండెత్తి వచ్చెడి శత్రువుల నెదిరింతురు. ఆవృద్ధుఁ డీకదంబవృక్షముక్రిందఁ గూర్చుండినంతలో గ్రామమంతయు నిముసములో గగ్గో లయ్యెను. పల్లవులయొక్క యాటవికసైన్యము గ్రామమును ముట్టడించె నని తొందరగా నటునిటు పరుగులెత్తు యువకులును, భయముచేత దద్దరిల్లు

స్త్రీలను జెప్పికొనఁ జొచ్చిరి. వృద్ధులేమి చేయుదురు? ప్రాకారపు గోడ వెడల్పైనది. దేహపుష్టిగల పురుషులందఱు నిచ్చెనలు వేసి కాని గోడ లెక్కి శత్రువులమీఁద ఱాలు రువ్వుచుండిరి. కత్తులు విసరుచుండిరి. కాని, శత్రువుల యాయుధములు బలిష్ఠములైనవి. ఈయలుపపుగోడలను, నిట్టిసామాన్యగ్రామముల యల్పములైన ప్రాకారద్వారములను దేలికగా నిర్మూలించుటకుఁ దగిన సాధన సంపత్తి శత్రువులకుఁ గలదు. వారు సైన్యము. గ్రామస్థులు వట్టి గ్రామస్థులు. పది నిముసములలోఁ గుడ్యద్వారము భేదింపఁ బడెను. శత్రువులు గ్రామప్రవేశము చేసిరి. గ్రామములోనున్న పరిమితసంఖ్యాకులైన యువకులు ఖడ్గధారులై వారి నెదిరించిరి. కాని యేమి లాభము? వారందఱను శత్రువులు సంహరించిరి. ఊరిమీఁదఁ బడి శత్రుసైన్యము బీభత్సము చేయుచుండెను. కొందఱు వృద్ధు లనియుఁ, బసివా రనియు లేక ధనము దాచిన చోటులు చెప్పఁడని కత్తులతో నఱకుచుండిరి. జనమందఱు భీతినొంది లోనికిఁ బోయి తలుపులు వేసికొనిరి. శత్రుసైనికు లాతలుపులను బ్రద్దలు కొట్టి లోనికిఁ బోయి భర్త కంటియెదుట భార్యకు మానభంగముఁ జేయుట, కొడుకు చూచుచుండఁగాఁ దండ్రిని నఱకుట, తల్లియెదుటఁ బిల్లలను సంహరించుట, యింటిలో నిప్పు తెచ్చి చూఱులకు ముట్టించి లోని మనుష్యుల లోననే యుంచి బయటఁ దలుపులకు గొళ్ళెములు పెట్టి తగులఁ బెట్టుట మొదలైన యత్యాచారములు తెలుపిలేకుండఁ జేయు చుండిరి. దారివెంట మానిసి పోవుటకు లేదు.

ఈకదంబవృక్షగృహవాసులకుఁ గాదంబు లని పేరు.

మయూరుఁడు లోనుండి తలుపు తీసికొని బయటికిఁ బోదు ననెను. తలిదండ్రులు, తాతగారు పోనియ్యరు. ఆభయసమయములోఁ దక్కిన వృద్ధులును వారివారి యిండ్లకుఁ బోవుటకు వీలు లేక పోయెను. వారును వీరియింటిలోననే యుండిరి. ఆయింటికి ముందుఁ బెద్ద ఖాళీస్థల ముండెను. చుట్టును ప్రాకార ముండెను. వీథితలుపు వేసిరి. రెండెడ్లును, మూఁడావులును, రెండుగేదెలును వారి కున్నవి. వాని తలత్రాళ్ళు కోసి యదివరకే వానిని వదలి పెట్టిరి. గొడ్లకు గాడిగా వేసిన మొకరములు, బల్లలు, దూలముఁ దెచ్చి వీథితలుపున కడ్డముగా వేసిరి. మయూరునితల్లియుఁ, దండ్రియు, సప్పగారును, దాతగారును, దక్కిన నలుగురు వృద్ధులు నసలుగృహములోనికిఁ బోయి వీథితలుపును, దొడ్డి తలుపును గడియలు వేసి యింటిలోని త్రోళ్ళు, మంచములు, బల్లలు, గడమంచి రెండుతలుపుల కడ్డముగా నుంచి దైవమును ప్రార్థించుచుఁ గూర్చుండిరి. బయటఁ గోలాహలము, స్త్రీశిశు వృద్ధరోదనములు, పశువుల యంభారవములు హృదయవిదారకముగా వినిపించుచుండెను. మయూరునితండ్రి గవాక్షము నుండి చూచెను. కొన్నియిండ్లు తగులఁబడిపోవుచుండెను. అగ్నిజ్వాలలు మిన్ను ముట్టుచుండెను. పెంకుటిండ్ల వాసములు చీలిపబద్దలై పెఠీలు మని పగిలి మండుచున్న మేకులు లేచి దూరమునకుఁ బోయి పడుచుండెను. కాదంబులది పెంకుటిల్లు. ఏమండుచున్న దూలము, నేతగులఁబడుచున్న వాసము తమ యింటిమీఁదఁ బడునో! తామందఱు లోపలివారు లోపలనే కుమ్ముపెట్టినట్లు చనిపోవలసివచ్చునో యని వారందఱును

భయపడుచుండిరి. మయూరునితల్లియు, నప్పగారును బట్టు కొనుటకు వీలు లేకుండఁగ నేడ్చుచుండిరి. పొరుగింఁడ్లవృద్ధులు గోడల కానుకొనఁబడి శవములవలె వ్రేలఁబడిరి. ఈస్థితిలో మయూరుఁడు బయటికిఁ బోవుదు ననును. తండ్రి వారించును. తాత మనుమని దగ్గఱకుఁ దీసికొనెను. తాతతండ్రు లిద్దఱు పిల్లవానిని బోకుండఁ బట్టుకొనిరి.

ఇంతలోఁ బ్రళయము వారియింటిమీఁదికే వచ్చెను. వీథితలుపులు బ్రద్దలుకొట్టు శబ్దములు వినవచ్చెను. మయూరుని తల్లియు, నప్పగారును మయూరనితండ్రిని గౌఁగిలించుకొని యేడ్వ నారంభించిరి. ఆమహాదుఃఖములో మయూరిని బట్టు కొనుట తప్పినది. మయూరుఁడు దొడ్డితలుపున కడ్డముపెట్టిన మంచమును లాగి తలు పోరవాకిలిగఁ దీసి బయటకు వెడలి పోయెను. వారిదొడ్డిలో నొకపిడుకలగుడిసె యుండెను. పిడు



కలగుడిసె నానుకొని యొకచొప్పగూడు కలదు. ఈరెండింటి నడుమ మయూఁరుడు దూరెను. దూరి రెండు చొప్పకట్టల నడు ముగాఁ దనతల కనుపించకుండ దాఁగియుండి చూచుచుండెను. వీథితలుపు పగులఁగొట్టి దూలములు పెడకుఁ ద్రోసి పాతికమంది

యాటవికులు లోనఁ బ్రవేశించిరి. ఇంతింత మీసములు, దున్న పోతులవంటి యాకారములు, చింతనిప్పులవంటి కన్నులు వారిని జూచినంతనే యెవరికైనను బ్రైప్రాణములు పైకిఁబోవును. వా రింటితలుపును ద్రోయుటకు బ్రయత్నించిరి. త్రోయుటకు సాధ్యము కాలేదు. అచటిదూలములను దెచ్చి పదిమంది పట్టి తలుపు బ్రద్దలుకొట్టిరి. లోనుండి తల్లిదండ్రులయు, నప్పగారియు వృద్ధులయు నిల్లెగిరిపోవునట్టి యేడుపులు వినవచ్చెను. కొంత సేపటికి వారు తనతండ్రిని బయటకు లాగుకొనివచ్చుటయు మయూరుఁడు చూచెను. తనతండ్రి తమయింటివాకిట నఱుకఁ బడుట మయూరుఁడు చూచెను. ఒక గంటసేపటికి నాటవిక సైన్యమంతయుఁ దమయింటిలోనుండి వెడలిపోయెను. మయూరుఁడు వారిని లెక్కపెట్టెను. ఇరువదియాఱుగురు వచ్చిరి. ఇరువదియాఱుగురు వెడలిపోయిరి. ఊరంతయు సద్దుమడగెను. అప్పుడు మయూరుఁడు తాను దాఁగియున్న చోటినుండి వెడలి వచ్చి, భయముతోఁ దండ్రి శవమువంకఁ జూచుచు బిక్కుబిక్కు మనుచు నింటిలోనికిఁ బోయెను. ఆకుఱ్ఱవాని సృష్టి యేమో మఱియొకఁడైనచో వాని కావఱకే ప్రాణములు కడవట్టి యుండును. ఇతఁడు తల తలగా మొండెము మొండెముగా, నెత్తురుపడియగా నున్న తండ్రిని జూచెను. అతనిగుండె చెదరలేదు, అతఁడు బిగ్గరగా నేడువలేదు. మూర్ఛపడిపోలేదు. అతని కన్నులలో భయమా కనిపించుచున్నది. అది యొకవిచిత్రముగా నొక కోపరేఖ కనిపించుచున్నది. అతఁడు లోనికిఁ బోయెను. తల్లియొక్కయు, నప్పగారియొక్కయు శరీరములు

వివస్త్రములై కత్తులచేత గాట్లు తిని పడియుండెను. వృద్ధులు నల్గురు నేమైరో కనిపించలేదు. అతఁడు తల్లివద్దకుఁ బోయెను. తల్లి గొంతులోఁ గొంచెము ప్రాణమున్నది. గొంతుమీఁది చర్మము కొంచె మాడుచుండెను. అతఁడు పోయి 'యమ్మా' యని పిలిచెను. అమ్మ పలుకలేదు. ముక్కుదగ్గర వ్రేలు పెట్టెను. గాలి తగులలేదు. అప్పగారివద్దకుఁ బోయెను. ఆమెయు శవమే. కొంత సేపటికి వృద్ధులకోసము వెదకెను. దొడ్డిగుమ్మముదగ్గఱ తనతాతగారు పడియుండెను. అతనిమెడమీఁద నొకత్రోలు దొర్లింపఁబడియుండెను. ఊరిలోని నలుగురువృద్ధులలో నిద్దఱు చనిపోయిరి. ఒకనిమెడమీఁదఁ గత్తివాటై నెత్తురు కారుచుండును. మఱియొకని కాలు నరుకఁబడియుండెను. వారిద్దఱికి నింకఁ గొంచెము ప్రాణము లుండెను. మయూరుఁడు వారిని జూచెను. తల్లివద్దకు వచ్చెను. అప్పగారికడకుఁ బోయెను. వాకిటిలోనికిఁ బోయెను. తండ్రిశవమువంకఁ జూచెను. బమ్మెరపోయినవాని వలె నటునిటు చూచును. అటునిటు తిరుగును. తండ్రివద్దకుఁ బోయి తండ్రితల మొండెమున కంటించెను. తండ్రిచేయి తన చేతితోఁ బట్టుకొనెను. వందసార్లింటిలోనికిఁ బోయెను. వంద సారులు బయటికి వచ్చెను. నడుమనడుమఁ బోయి యాపిడుకల గుడిసెయుఁ జొప్పగూడును వాని మధ్యదారి యూరకే యింటి వంకఁ జూచును. చివరకు గొడ్లసావడి లోనికిఁ బోయి యచట గొంతుకూర్చుండి మోకాళ్ళమీఁద మొగ మానిచి, చేతులు మోకాళ్ళచుట్టు ముడివేసి యట్లే కూర్చుండెను. చాలసేపటికి జనము నడచుచున్న యలికిడి తోఁచెను. వారి మాటలు విని

పించెను. అతఁడు తలయెత్తి చూడలేదు. మఱల నా రాక్షసులు వచ్చిరని తన్నుగూడా నఱకెద రని యతనియూహ. ఇంతలో 'నిడుగో ! మయూరుఁడు. ఇతఁడుమాత్రము మిగిలినాఁడు' అన్నమాట యతనికి వినవచ్చెను. ఆగొంతుక తా నెఱిఁగినదే. ఎవరిదో గుర్తులేదు. త న్నెవరో చేయి పట్టుకొని లేపిరి. మయూరుఁడు లేచి చూచెను. ఎవరివో పదిమంది మొగములు కనిపించెను. మయూరునకు వారిని దా నెఱుఁగునో, యెఱుఁగఁడో తెలియలేదు. మయూరుఁడు బ్రతికియుండెనా ? అతని కన్నులు చూచుచుండెనా ? ఆవచ్చినవా రతనిని జేయి పుచ్చుకొని తీసికొనిపోవుచుండిరి. అతఁడు నడచుచుండెనా ?

---

# ద్వితీయాధ్యాయము

స్థానాకోడూరుకు సమీపమున నర్ధయోజనములోపుగా నొక గ్రామము కలదు. స్థానాకోడూరును దగ్ధము చేసిన సైన్య మాయూరిమీఁదికిఁ బోలేదు. ఆయూరు పేదయూరు. కోడూరు ధనధాన్యసమృద్ధిగల గ్రామము. ఆ యూరిప్రజలు తమ కీయాపద తప్పిన దని తెలిసికొని యీ గ్రామములోఁ బ్రజ లేమైరో తెలిసికొనుటకుఁ బదిముతాలుగా వచ్చిరి. ఆ పేదగ్రామములోని జనులందఱునుఁ గోడూరులోని ధనవంతుల మీఁద నాధారపడియున్న వారు. వీరిపొలము పాలికిఁ దీసికొనియును, వీరివద్ద కూలినాలి చేసికొనియును జీవించువారు. కోడూరు దగ్ధమైనచో నాయూరుప్రజల బ్రదుకు బయట పడ్డట్లే. ఈ పదిముతాలు వచ్చి స్థానాకోడూరులో నింటింటికిఁ దిరిగి బ్రతికియున్నవారిని సమాదరించుటకును, గాయములు తగిలినవారిని రక్షించుటకును, సాయపడుచుండిరి. ఆ పేదపొరుగు పొరుగూరిలోని యితరవర్ణములవారే కాదు. ఆయూరిలోని బ్రాహ్మణులుకూడఁ గోడూరి ధనవంతులమీఁద నాధారపడి యున్నవారే. ఈ వచ్చినముతాలలో నొకముతా నిద్దరులో

బ్రాహ్మణు లుండిరి. వారికిఁ గోడూరులో రాజాశ్రయము కలదు. మయూరునితండ్రి కన్నోదకములకు లోపము లేదు. చేయి విదల్చుటకుఁ గూడఁ దగినంత యున్నది. ఆయన కొంత యుదారుఁడు. ఈ బ్రాహ్మణులు వాని యుప్పు తిన్నవారే. అందుచేత నా బ్రాహ్మణులు మయూరుని తండ్రి యింటికి వచ్చి చూచిరి. ఇల్లంతయును బీనుఁగుపెంటలై యుండెను. పసివాఁడైన మయూరశర్మ యొక్కఁడును గొడ్ల సావడిలోఁ గూర్చుండియుండుట యా బ్రాహ్మణులలో నొకఁడు చూచెను. ఆ చూచినవాఁడే వారి యాశ్రితుఁడు. కోడూరులోనున్న వేయిగడపలో ధనవంతులైన యేబది యఱువది గడప మయూరునియింటివలెనే యయ్యెను. తక్కిన గృహములు నిర్ధూమధామము కాలేదు. దెబ్బలు తిన్నవారు, పాఱిపోయినవారు, దాగుకొనినవారు — ఈ మాత్రముగానే తక్కినయిండ్లు గడచెను. ఆయాటవికసైన్యము వట్టి సైన్యము కాదు. వారు చోరులవలె నుండిరి. గ్రామములోనున్న లోతు పాతులు తెలిసికొని యెవరు ధనవంతులో, యెవరు కారో మొదలైన లోగుట్టు తెలిసినవారే. అందుచేత నట్లు జరిగెను.

మయూరుని నా బ్రాహ్మణుఁడు తనవెంటఁ దీసికొని పోయెను. మయూరునకు వేఱే బంధుగులు లేరు. ఆహా! మయూరుఁడు తమయాశ్రితుల కాశ్రితుఁడయ్యెను. ఎట్లో యట్లు బ్రతికెను. అతని కాయుర్దాయ మున్నది. కనుకనే యింటిలోనుండి తప్పించుకొని పోయెను. లేనిచో నతఁడుగూడ నా కసాయి వాండ్రకత్తుల కెఱ యయ్యెడివాఁడే. మయూరునిఁ దీసికొనిపోయి

యాబ్రాహ్మణుఁ డారాత్రి నిద్రపోఁగొట్టెను. మయూరునకుఁ దా నన్నము తింటినని తెలియదు. నిద్రపోయితి నని తెలియదు. మఱునాఁడు ప్రొద్దున మయూరున కెక్కడలేని జ్వరము వచ్చెను. వెఱ్ఱికేకలు, మంచముమీఁదినుండి లేచిపోవుటయు, 'అదిగో వాఁడు నాకు గుర్తున్నాఁడు. కత్తి యిటుతెమ్ము; నేను వానిని నఱకెదను,'- ఈమొదలైనమాటలు. ఆబ్రాహ్మణుని పేరు రామశర్మ. ఆ పేదయూరిలో వైద్యుఁడు లేఁడు. కోడూరులో వైద్యుఁ డున్నాఁడు. ఆవైద్యుని సంసారము నిష్ఠ యయినది. వైద్యునికొఱకు నాలుగామడలు పోవలసివచ్చెను. రామశర్మ యావైద్యుని కాళ్ళవ్రేళ్ళఁ బడి, మయూరుని తండ్రి యౌదార్యాదులు చెప్పి, కోడూరునకు సంభవించిన మహాపదఁ జెప్పి, బాలుఁడైన మయూరుని సల్లక్షణములు చెప్పి యావైద్యుని దెచ్చెను. ఆవైద్యుఁడు వచ్చి స్మృతిలో లేని మయూరుని జూచెను. ఆవిశాలమైన నుదురు, చెవి తమ్మలదాక వీఁగియున్న కనుదోయి, మొగములోనున్న గంభీరిమ - వీనిని జూచి యావైద్యుఁ డాబాలునకు వశంవదుఁ డయ్యెను. ఈబాలునియందు మహాపురుషలక్షణము లున్నవి. బ్రతికినచో నే మగునో! అంత భయంకరమైన బీభత్సముఁ జూచి. గుండె పగిలి మృతిఁ బొందని యాబాలుని ధైర్య మెంతటిదో! కలవరించుచుఁ 'గత్తి యిటు తే, వానిని నఱకెద' ననుచున్న వానిగుండెలో నేశౌర్యరేఖ యిమిడి యున్నదో యని యతఁ డాలోచించి యాతని కూరకే వైద్యము చేసెను. ఊరక కాక ధన మిచ్చెడువా రెవరు? ఆబ్రాహ్మణుఁడా

నిఱుపేద. అతనికి మయూరుని తండ్రివలన నాల్గుడ్రేళ్ళను లోనికిఁ బోవుటమాత్రమే జరుగుచుండెను.

మయూరునకు నెలదినములకుఁగాని నెమ్మదించలేదు. మయూరుఁడు వచ్చిననాటినుండి బ్రాహ్మణునకు నిల్లెట్లు గడుచునా యను దిగులు పోయినది. కోడూరులోని మయూరుని యాస్తిని రామశర్మయే పాలించుచుండెను. మయూరున కతఁడు లోపము చేయఁ దలఁచుకొనలేదు. తాను న్యాయముగాఁ దన కుటుంబరక్షణముఁ జేసికొనుచు మయూరుని బెంచుచుండెను. ఆబ్రాహ్మణుఁడు మయూరునకుఁ జదువు చెప్ప నారంభించెను. మయూరుఁడు కులముచేత బ్రాహ్మణుఁడు కాఁడు. రామశర్మకు వయసు ముదిరినను సంతానము లేదు. ఎవరినో బ్రాహ్మణబాలుని దెచ్చి పెంచుకొనుటకుఁ దన కాస్తిపాస్తులు లేవు. రామశాస్త్రిభార్యపేరు గంగాదేవి. ఈదంపతులకు మయూరుఁడే కొడు కయ్యెను. ఆయూరిలో మఱినాల్గు బ్రాహ్మణుల కొంప లున్నవి. వారందఱును రామశర్మను వెలివేసిరి. అతఁ డన్నాఁడుకదా 'మయూరుని తండ్రి నా కన్నగారు. నే నతనికిఁ బుత్రదాత నయ్యెద' నని. ఒక్కొక్కని సహజగుణము చమత్కారముగా నుండును. వాని నెదిరించినకొలఁది వాఁడు కఱకెక్కును. రామశర్మ యట్టివాఁడు. తక్కిన మూఁడు బ్రాహ్మణగృహములు వీనిని వెలివేసినంతనే రామశర్మ మయూరునకు నుపనయనముఁ జేసి మయూరశర్మ యని పేరుఁ బెట్టెను. రామశర్మ పెద్ద చదువుకొనినవాఁడు కాఁడు. ఏదో పంచకావ్యములు, శ్రౌత

స్మార్తములుఁ జెప్పుకొనెను. అవియన్నియు మయూరశర్మకుఁ జెప్పెను. మయూరశర్మ తక్కినయెల్లప్పుడు సరిగానే యుండును బాబు చెప్పినదియెల్లఁ జదువుకొనును. చెప్పినది నిముసములోఁ గ్రహించుకొనును. గ్రహించినది యర నిముసములో నెమరకుఁ దెచ్చుకొనును. మయూరశర్మ సరిగాఁ జదివినచో రామశర్మచదువు వానికి వచ్చుటకు రెం డేండ్లుకంటెఁ బట్టదు. కాని మయూరుఁడు సరిగాఁ జదువఁడు. ఎప్పుడును బొలాలమీఁదికిఁ బోయి తిరుగుచుండును. ఆయూ రికిఁ గ్రొత్తవా రెవరైన వచ్చినచో వారియందఱి ముఖ లక్షణములు బరిశీలించును. ఒక్కొక్కప్పు డట్లే యెవ్వరివంకనో చూచుచుండును. మరియు నొక్క పొరుగూరివానివెంటఁ బడి యూరు వదలి చాలదూరము పోవును. కొంతసేపటికి వీఁడు కా దనుకొనినట్లు తిరిగివచ్చును. అట్లు వచ్చినతరువాతఁ బది పదునేనుదినములు మయూరుఁ డెవ్వనితోడను మాటాడఁడు. గంగకాని, రామశర్మకాని బలవంతముగా లేపి భోజనము పెట్ట వలెను. ఈపదునేనుదినములలో నతఁడు భోజనము చేయుటఁ జూచినచో రామశర్మ కోడూరునుండి వానిని దెచ్చిన రాత్రి నుండి యితఁడు భోజనము చేసిన పద్ధతియే గోచరించును. రామ శర్మను వెలివేసిన బ్రాహ్మణులుకూడ రామశర్మ యౌదార్య మును, గృతజ్ఞతను మెచ్చుకొందురు. రామశర్మతో వారికి విరోధము లేదు. పైగా వారందఱకు మయూరుఁ డన్నచో మిక్కిలి జాలి. మిక్కిలి ప్రేమ. అందఱకు మయూరుఁ డేదో, యెప్పుడో యెట్లో మహాపురుషుఁ డగునని యొక విశ్వాసము.

మయూరునకుఁ బండ్రెండేండ్లు వచ్చినవి. ఒకనాఁడు మయూరుఁ డెచ్చటికో పోయెను. ఈపోవుట యలవాటేకదా! మఱల సాయంత్రమునకుఁ దిరిగివచ్చు నని రామశర్మ యనుకొనెను. ఆసాయంత్రమున రాలేదు. అట్టి యిరువదిసాయంతనములు రాలేదు. గంగారామశర్మలు మిక్కిలి దుఃఖించిరి. 'ఓయి నాయనా! మాకృతజ్ఞతకు మాబ్రాహ్మణ్యము వెల పెట్టితిమి. కనిపించవోయి తండ్రీ' యని యావటిల్లిరి. వారిస్థితి మంచము పట్టుటమాత్రమే కొఱతగా నుండెను. ఇఱువది యొకటవదినమున మయూరుఁడు తిరిగి వచ్చెను. ఎచ్చటికిఁ బోయెనో యెవ్వరికిని జెప్పలేదు. రామశర్మ కతఁ డింటికి వచ్చుటయే చాలు. అతఁ డడుగనేలేదు. ఆవచ్చిన మయూరుఁ డట్లే నాలుగునెల లెచ్చటికిని గదలనే లేదు.

ఒకనాఁడు మఱలఁ బోయెను. పదిదినము లాగి వచ్చెను. ఇట్లు పోవుటయు, నొక్కొక్కసారి నెలదినములుకూడ నుండి వచ్చుటయు మయూరునకుఁ బరిపాటి యైపోయెను. గంగారామశర్మల కతఁ డింటికి రాలే దన్న సంగతి క్రమముగాఁ దగ్గిపోయెను. దినములు, నెలలు, సంవత్సరములు గడచిన కొలఁది మయూరుఁడు పొడుగరి యయ్యెను. ఆజానుబాహు వయ్యెను. వ్యాయామము చేసినవానికంటె నతఁడు కఠినీకృత శరీరుఁ డయ్యెను. కొన్నిదినములు పోయినతరువాత నెచ్చటికో పోయి యే నెలనాళ్ళకో తిరిగివచ్చిన మయూరుఁ డెప్పుడును బ్రొద్దుక్రుంకి చీఁకటి పడినతరువాతనే వచ్చును. వచ్చినప్పు డెప్పుడు నేదో యుత్తరీయములో దాచియే తెచ్చును. రామశర్మ

కోడూరునుండి వారియింటిలోని కొన్ని సామానులు తెచ్చెను. అందులో నొక భోషాణ ముండెను. ఆభోషాణము మయూరు నిది. అందులో మయూరుఁ డేమి పెట్టుకొనునో యతనికే తెలియును. గంగారామశర్మలు దానివంకనే చూడరు. ఒకసారి మయూరుఁ డింటికి వచ్చినప్పుడు వాని యెడమ భుజము మీఁదఁ బెద్దకత్తిదెబ్బ తగిలియుండెను. మఱియొకసారి యెడమ భుజము మీఁదఁ గత్తిదెబ్బ తగిలియుండెను. గంగ వానికిఁ గట్టు కట్టి నెమ్మదింపఁజేసెను. 'నాయనా! యీకత్తిదెబ్బ లేమి? నీతండ్రి వంశాంకురము నీవొక్కఁడున్నావు. ఇట్టిజోలులకుఁ బోకురా' యనుచు దాని కారణము వందసారు లడుగును! అతఁడు వందసారులును జెప్పఁడు. ఏవో యల్లిబిల్లి సమాధానములు చెప్పునుగాని యథార్థ మెప్పుడును జెప్పఁడు.

అతనికిఁ బదునాఱేండ్లు వచ్చెను. వానిని జూచి బ్రాహ్మణ బాలుఁడని యెవ రనుకొందురు? నీ పే రేమి యని యడుగుము. మయూరశర్మ యని సమాధానము చెప్పును. క్షత్రియుఁడును గాఁడు, బ్రాహ్మణుఁడే యనుకొనును. పదునాఱేడులు వచ్చిన మయూరశర్మకు రామశర్మ వివాహము చేయఁదలంచెను. బ్రాహ్మణకన్యను దెచ్చి చేయవలె నని రామశర్మ యుద్దేశ్యము. కాని బ్రాహ్మణులు పిల్ల నెవ రిత్తురు?

మయూరునకు వివాహము చేసికొనవలెనను కోరిక లేదు. అతఁడు నాకు వివాహ మక్కఱలే దనును. రామశర్మ వంద నూరిపోయును. రామశర్మచేత వివాహప్రస్తావన మానిపించుటకు మయూరున కొక్కటే యుపాయము. తా నెచ్చటికైనను

బోయి వేదశాస్త్రములు చదువుదు ననును. రామశర్మ వివాహ ప్రసంగము మానివేయును. కుఱ్ఱవానిని జదువుకొనుట కెచ్చటకుఁ బంపించవలయును ? కాశి మొదలైన పట్టణములకుఁ బోయినచోఁ బిల్లవానిని వదలి తా నుండలేఁడు. ఏదో సమీపముననున్న నగరమునకే పంపవలయును. పల్లవుల రాజధానియైన కాంచీనగరము మహాపండితులైన బ్రాహ్మణులకు నివాసభూమి. అచ్చటకుఁ బంపించినచో !

---

# తృతీయాధ్యాయము

మయూరునకుఁ బదునాఱేండ్లు వచ్చినతరువాత నతని మనస్సు విచిత్రముగా నుండెను. ఎనిమిదేండ్లు చిన్నవయస్సు, పదునాఱేండు యౌవన ప్రాదుర్భావసమయము. ఎనిమిదేండ్లు మఱియుఁ జిన్నతనముక్రిందనే లెక్క. అప్పుడు జరిగిన విషయములు యౌవనసమయములో విస్పష్టముగా జ్ఞాపక ముండునా? సుఖ దుఃఖముల ననుభవించు నెనిమిదేండ్లనాఁటి శక్తికిని, బదునాఱేండ్లనాటి శక్తికిని సంబంధ ముండునా? ఒక విషయము మనస్సుమీఁద ముద్రింపఁబడుటలో నప్పటికి నిప్పటికి భేద ముండదా? తండ్రి చిన్నప్పుడు చనిపోవును. పెద్దవాఁ డైనతరువాత మానాయన చిన్నప్పుడే చనిపోయె నందురు. ఆతండ్రిని గూర్చి దుఃఖపడుదురు. దుఃఖపడుదు రనఁగా లోకములోఁ దండ్రులు చనిపోవుట యను విషయము దుఃఖహేతువుగా భావింపఁబడుటచేత వీరును నది దుఃఖ మనుకొనుటయేకాని, వీరి కది గాఢదుఃఖానుభూతివిషయము కాదు. ఒకఁడు పెద్దవాఁ డైనతరువాతఁ దండ్రి చనిపోవును. వానిదుఃఖము తండ్రి తలఁపునకు వచ్చినప్పుడెల్ల నుండును. చిన్నప్పుడు తండ్రి చని

పోయినవాని దుఃఖ మిట్టిది కాదు. దీనికిఁ గారణము తండ్రి మరణము పిన్న వయస్సున నతనిమనస్సుమీఁద నంతగాఢమైన ముద్ర వేయలేక పోవుటయే. అట్లే మయూరుఁడు తన చిన్న నాఁటఁ జూచిన తన కుటుంబ ఘోరదృశ్యము వానిమనస్సు మీఁద నంతగాఢముగాఁ బనిచేసెనా యన్నది. పని చేసినచో నిప్పటికి నతఁడు దానినిగూర్చి గాఢముగా యోచించవలయును. ఈమనస్సులోఁగూడ ననేకములైన పొరలు కలవు. ఒకమనస్సు బాల్యము మొదలు వార్ధక్యమువఱకును జీవికి సహజమైనదిగా నుండును. భిన్నవయస్సులయందుఁ దత్తత్కాల విషయముల యోజన చేయు మనస్సు భిన్నభిన్నముగా నుండును. తార్కికులు దీని నొకవిధముగాఁ జెప్పుదురు. ఈశరీరము ప్రతినిమేషము మారుచుండును. అట్లే ప్రతిద్రవ్యము మారుచుండును. ఈ మార్పులంతటను నొక సమానమైన యాద్రవ్యరూపము కనిపించుచునే యుండును. అట్టి సమానమైన మనస్సు వేఱే యుండును. ఆమనస్సుమాత్రమే బాల్యమునందుఁ బనిచేయును. వయసు వచ్చినతరువాత భిన్నపరిస్థితులచేత మనస్సునకుఁ గలుగు సుఖదుఃఖములయొక్క యనుభూతిలోని చిక్కదన మామనస్సున కుండదు. ఒకనివలన మన కపకారము జరిగెను. వానిమీఁద మనమనస్సు పగఁ బట్టును. ఈపగ పట్టునంతశక్తి మనస్సునకుఁ బసితనమం దుండదు. ఆశక్తి వయస్సుతో వృద్ధి పొందును. మయూరునకుఁ దన కుటుంబమట్లు సంహరింపఁబడుటకు హేతువైన పల్లవరాజుమీఁదఁ బగఁ బట్టుటకు

వాని యెనిమిదేండ్లనాఁటి మనస్సు చాలదు. కాని యేదో లీలగా వానిమనస్సునం దాభావము లేకపోలేదు.

ఎవరో క్రొత్తవారు కనిపించుటయు, వారివెంటఁ బడి మయూరుఁడు పోయి వాఁడు, వాఁడు కాఁడని, తిరిగి వచ్చుటయుఁ, గొన్నియేండ్లక్రింద జరుగుచుండెను. నాలుగేండ్లనుండి యట్టిదేదియు జరుగలేదు. అతని యాపదునాలవయేఁట నతని క్రొత్తమానిసి కనిపించెను. ఈరాజ్యమంతయుఁ బల్లవరాజుల యధీన మయ్యెను. పల్లవుల రాజకీయాధికారు లప్పుడప్పుడు వచ్చుచుందురు. పోవుచుందురు. ఈపేదపల్లెటూరున కెప్పుడు రారు. ఇన్నేళ్ళ కిప్పు డీయూరొకయధికారి వచ్చెను. ఎందుకు వచ్చెనో మయూరునకుఁ దెలియదు. కాని, యతనిని జూచిన తోడనే మయూరునకు మనస్సులో నేదియో కలవరము జరిగెను. ఎనిమిదేండ్లక్రిందఁ దాను జూచితి ననుకొన్న యొక ముఖలక్షణ మాయధికారిముఖమునఁ గనిపించెను. పూర్వమువలె నతని వెంటఁబడి పోవుటకు వానిని బరిశీలించుటకు నితఁడు సామాన్యుఁడు కాఁడు. రాజాధికారివెంటఁ బడి యూరకే పోయినచో వారు రానీయరు. అందుచేత నతఁడు తా నొక యుపాయము పన్నుకొని వానియొద్దకు వెళ్ళెను. అవసరము వేచి, దర్శనము చేసి, 'యయ్యా ! నాపేరు మయూరశర్మ. నాతండ్రి రామశర్మ. నే నేదోకొంత సంస్కృతము చదువుకొంటిని. నాకేదైన నొక యుద్యోగము వేయించుఁ'డని మనవి చేసెను. ఆ యధికారి కనుబొమలు ముడిచి, మయూరునివంక విచిత్రముగాఁ జూచెను. అతఁడు చూచిన వట్టిచూపే భయంకరముగా నుండెను. ఆచూపు

చూచినతోడనే మయూరుని మనస్సుమీఁద ఫెడేలున దెబ్బ కొట్టిన ట్లయ్యెను. మయూరునకుఁ దెలియకుండ, 'నీవేనా' యని వచ్చెను. ఆ యధికారి కీమాట యర్థము కాలేదు. అందుచేత మయూరుఁడు తరువాత నాలుగైదుమాటలలో దానిని సర్దుకొనెను. కాని బాగుగా నిశ్చయింపవలయు నని బుద్ధి పుట్టెను. అధికారిదారి నధికారి పోయెను. మయూరుఁ డెట్లు నిశ్చయించును ? అతనిపేరు, నతనియధికారము వానిని గనుగొని జ్ఞాపకముంచుకొనెను. మఱల నాయధికారి యాతనికిఁ గనిపించుట యెట్లు ? తరువాత వారము దినములవఱకు మయూరున కదియే యూహ. ఈవారమురోజులలోని యూహాపరంపరయుఁ జివర కదికి యిట్లేర్పడెను. తనచిన్నప్పుడు తన యింటిలోఁ దనసర్వకుటుంబమును నాశనము చేసిన సైనికులకు నాయకుఁ డైనవానిని దా నంతసేపును జూచెను. వాని కన్నులవియే. వాని మొగ మదియే. కాని, వాఁడు పొడుగరి. వీఁడు పొట్టివాఁడు. వాఁడు పొడుగరియో, పొట్టివాఁడో సరిగా జ్ఞాపకము లేదు. వీనికోసమే తాను నాలుగేండ్లు వెదకెను. ఈ కడచిన నాలుగేండ్లు మఱచిపోయెను. ఆయూహల యొక్క సారాంశ మిది. ఇప్పటి మనస్సు దీనిపై నాలోచింప మొదలు పెట్టెను. మానిసిని బోలిన మానిసి యుండవచ్చును. తరువాత వారు వారు చెప్పికొనఁగా నది యాటవికసైన్య మని తాను వినెను. ఇతఁడు నాగరకుఁడు. సైన్యాధికారి కాఁడు. రాష్ట్రవ్యవహారములను బరిశీలించు నధికారి. ఈ యధికారితో మాట్లాడుట యెట్లు ? అంత యధికారి తనతో మాట్లాడునా ?

కోడూరునకు నాలుగుయోజనముల దూరములో నొక పట్టణము కలదు. ఈయధికారి యాపట్టణములోఁ బదిదినము లుండునఁట! అచ్చటికిఁ బోవుద మనుకొనెను. అనుకొనినదే తడవుగా నచటికిఁ బోయెను. అధికారిని జూచుట యెట్లు? ఉద్యోగ మన్నసాకు పూర్వమే చెడిపోయెను. ఇట్లాలోచించు కొనుచుండఁగనే పదిదినములలోఁ దొమ్మిదిదినములు గడచి పోయెను. ఆయధికారి ప్రయాణదినము వచ్చెను. మయూరుఁ డానాఁటికి మధ్యాహ్నమున నాలోచనయు, సాలోచనయు లేకుండ నధికారియున్న సౌధమువద్దకుఁ బోయెను. అప్పు డధికారి ప్రయాణోన్ముఖుఁడై యుండెను. అధికారి మయూరుని జూచి 'యుద్యోగము లేదని చెప్పలేదా? పో' యని చెప్పెను. మయూరుఁడు తా నేమనుచుండెనో తెలియకుండఁ గనే యిట్లనెను. 'నేను ఖడ్గవిద్యలో మిక్కిలి నిపుణుఁడను. నావిద్యాప్రదర్శనము మీరు చూడవలయు'నని. అంతవఱకు మొగము మురకటించుకొని నిప్పులు గ్రక్కుచున్న యా యధి కారిమొగము వెంటనే మాఱెను. 'మఱి నే నిప్పుడు పోవు చుంటినే? నేను వైజయంతీపురము పోవుచుంటిని. నీ వచ్చటకు వచ్చినచో, నీ విద్యాప్రదర్శనము చూచెద' ననెను. అధికారి వెడలిపోయెను.

వైజయంతి యచ్చటికి చాలదవ్వు. మయూరుఁ డచటికిఁ బోలేదు.

తరువాత నేఁడాది గడచెను. రామశర్మకు మయూరుని కెక్కువవిద్యఁ జెప్పించవలయు నను నాశ పోలేదు. పిల్లవానికిఁ

బదునేడేడులు వచ్చినవి. అందఱుఁ జిన్నప్ప దీతఁడు మహా పురుషుఁ డగు ననుకొనిరి. పదునేడేండ్లు వచ్చినవి. ఇదివఱ కేమియు లేదు. అందుచే నతనినిగూర్చిన యాశలు సన్నగిల్లెను.

మయూరుఁడు తండ్రిని బీడింప నారంభించెను 'నన్నుఁ గాంచీనగరమునకుఁ దీసికొనిపోవుదు నంటి' వని, 'ఎప్పుడెప్పు' డని. మయూరునకుఁ గోరిక పుట్టుటయు, రామశర్మను దానిని గూర్చి యడుగుటయు నిదియే మొదటిసారి. మయూరునకుఁ గాంచీపురము చదువుకొనుటకుఁ బోవలయునన్న యూహాయే లేదు. కాంచీపురమునకుఁ దీసికొనిపొమ్మని తండ్రి నెందు కడుగుచున్నాఁడో తనకే తెలియదు. కాని, కాంచీపురము నకుఁ బోవలయునని యున్నది. అది మహానగరము. పల్లవ రాజధాని యెట్లుండునో చూడవలయు ననియా? ఈరాజాధి కారి యచ్చటఁ గనిపించు ననియా? వైజయంతికిఁ బోయినచో సులభముగా, నిశ్చయముగాఁ గనిపించెడి యాయధికారిని జూచు టకుఁ గనిపించుట సందిగ్ధమైన కాంచీపురి పోవుట యెందులకు?

ఈయెనిమిదేండ్లు రామశర్మ మయూరుని యాస్తిపాలించి, చాలడబ్బు నిలువఁ జేసెను. ఒకయేడాది రెండేండ్లలో నతని నొకయింటివానిని జేసి, వానిధనమును, వాని యాస్తియు వాని కప్పగింపవలయు నని రామశర్మ యూహ. రామశర్మ యా ప్రస్తావన యెప్పుడు తెచ్చినను మయూరుఁడు వినకుండ దులప రించుకొని పోవును. చివరకు మయూరుని యొత్తిడి యెక్కు వయై రామశర్మ కాంచీప్రయాణము గట్టెను. గంగాదేవికిఁ

గావలసినసంభారములు సమకూర్చి రామశర్మ మయూరునితోఁ బ్రయాణ మయ్యెను.

అచ్చటికిఁ గాంచీనగర మిఱువదిదినముల ప్రయాణము. కొంతదూరము బండ్లమీఁదఁ బోవలయును. పదిదినము లైన తరువాత వా రొకనగరమున నొకసత్రములో నొకరాత్రి శయనించిరి. రామశర్మ నిదురబోయెను. మయూరుఁడు మేల్కాని యుండెను. తమకు సమీపమున నెవరో యిద్దఱు మాటాడు కొనుచుండిరి. అందులో నొకఁడు 'భల్లాతవర్మను మఱల సైన్యాధికారిగా వేసిరి' యనెను. ఆమాట వినినంతనే మయూరున కెక్కడలేని జాగ్రత్తయు వచ్చెను. ఆరాజాధికారి పేరు భల్లాతవర్మ. కథ మఱికొంత సాగెను. తా ననుకొన్నట్లు భల్లాతవర్మ సైన్యాధికారియే. అతఁడే యితఁడేమో ! తరువాత వారు మాటాడుకొనిన మాటలకుఁ దనకు సంబంధము లేకపోయెను.

మఱునాఁడు లేచి మఱలఁ బ్రయాణము సాగించిరి. మఱలఁ బదిదినములకుఁ గాంచీనగరము చేరిరి. ఆకాంచీనగరము మహానగరము. ఈపరమగ్రామీణుల కాయూరియొక్క తలయుఁ, దోఁకయుఁ దెలియలేదు. తుదిమొదళ్ళు పట్టలేదు. దారివెంటఁబోవు నెల్లజనులు కూర్పాసములు ధరించినవారు. హేమాభరణధారులు. ప్రతివాఁడును ఠీవిగా నడుచుచుండును. ఎవరిని బలుకరించినను బదులే చెప్పరు. ఎల్లరకును నేదో మహాకార్య మున్నటులే కనిపించును. ఈజన మి ట్లుండఁగా వచ్చుచున్న పోవుచున్న శకటముల సంఖ్యకు లెక్కయే లేదు. రెండుగుఱ్ఱములు, నాల్గుగుఱ్ఱములు పూన్చిన శకటములు, చిత్ర

విచిత్రములుగా నలంకరింపఁబడి మిక్కిలి బలిసి వాయువేగ మునఁ బరుగెత్తు వృషములఁ బూన్చినబండ్లు, మనుష్య లొత్తి గిలిపోవుటకే కష్టముగా నుండెను. వారు చివరి కెవరినో కను గొని యొకసత్రము చేరిరి.

ఇందులో మఱియొక బాధ. వీరిభాష వేఱు, వారిభాష వేఱు. వీరు మాటాడినచో వారిలోఁ జాలమందికిఁ తెలియదు. ఎవరో తమదేశీయునివలెఁ గనిపించినచో వాని నడుగఁగా నా సత్రముపే రతఁడు చెప్పెను. వారు పోయి యాసత్రమున విడిది చేసిరి. అచ్చట వీరు నెవరి నెఱుఁగుదు మని చెప్పుదురు! మయూరుఁడు భల్లాతవర్మను జూచుటకు వచ్చితి మని చెప్పెను. దానితో వీరిని గౌరవింప నారంభించిరి.

# చతుర్థాధ్యాయము

భల్లాతవర్మ పేరు చెప్పినంతనే వీరికి గౌరవము జరుగుట నిజమే. కానియాభల్లాతవర్మ యెవరు ? అతని యుద్యోగమేమి ? అతని నెచ్చటఁ జూడవలయును ? చూచినతరువాత నతనికి, వీరికి సంబంధ మేమి ? ఒకవేళ వీ రాతనిఁ జూతురు. చూచినచో నతఁడు వీరి నెఱిఁగియున్నటులు నటించఁడు. భల్లాతవర్మ యిదివఱకు మయూరునిఁ జూచెఁగదా యన్నచో నది యేమి చూచుట ? ఒకమహోద్యోగి సంవత్సరముక్రిందఁ దన కుద్యోగ మిప్పింపు మని యడిగినవానిని గుర్తు పెట్టుకొనవలసిన యవసర మేమి? పెట్టుకొన్నను వానితోఁ బరిచయ మున్న ట్లేల మాట్లాడ వలయును ? ఎందుకు మాటాడును ? ఇంతకుఁ గాంచీ నగర ములో మహాపండితుఁ డెవఁడో యుండును. వాని యొద్ద మయూరుని శిష్యునిగాఁ జేర్చవలయును. భల్లాతవర్మకుఁ గాంచి లోని మహాపండితులు తెలియునా ? తెలిసినచో నితఁడు మయూ రుని దీసికొనిపోయి, 'యీకుఱ్ఱవాఁడు మావాఁడు, వీనికి దయ చేసి చదువు చెప్పవలయు' నని చెప్పెడునంత శ్రద్ధ నతఁడు తీసికొనవలసిన యవసర మేమి యున్నది?

తండ్రికొడుకులిద్దఱు చెఱియొకమాట. రామశర్మ యెవరి నైనను పండితుని గనుఁగొని మయూరు నప్పగింతు ననును. మయూరుఁడు ముందు భల్లాతవర్మను గనుగొనవలయు ననును. 'భల్లాతవర్మతో మన కేమి పని' యని రామశర్మ వాదించును. ఆయనపేరు చెప్పిననేగదా మన కింత గౌరవము కలిగెను. ఆయనతోఁ బరిచయము వృథాగాఁ బోదని మయూరుని వాదన.

ప్రొద్దుననే లేచి తనభాష తెలిసినవారినెల్ల 'నీయూరిలో మహాపండితు లెవరు? మాపిల్లవాని నాయనవద్దఁ జేర్పవలయు' నని యడుగుచు రామశర్మ పోవును. భల్లాతవర్మగా రెచ్చట నుండును? వానియుద్యోగ మేమి' యని తెలిసినవారి నడుగుచు మయూరశర్మ మఱియొకదెసకుఁ బోవును. ఇద్దఱును భోజనమువేళకు సత్రములోఁ గలియుదురు. ఇట్లు పదిపదునేను మంది పండితుల నామములు, వారు పాఠముచెప్పు శాస్త్రములు, వారివద్ద మయూరుఁడు చదువుకొనుట కుండినచో భోజనమునకుఁ జేయవలసిన యేర్పాటు - వీనిగుఱించి యొకగ్రంథమంత పెంచి రామశర్మ మయూరునకుఁ బూటపూట నొప్పఁజెప్పుచుండెను. మయూరుఁడు తండ్రి చెప్పినంతసేపు వినుచుండును. సమాధానమే చెప్పఁడు. మయూరుఁడు భల్లాతవర్మనుగూర్చి తెలిసికొనిన సంగతులు రామశర్మతోఁ జెప్పఁడు. భల్లాతవర్మ యొక సైన్యాధికారి. సర్వసేనానాయకులక్రింద నార్గురు సేనాపతు లుండిరి. ఒక్కొక్క సేనాపతిక్రింద నలుగురు దళవాయి లుందురు. భల్లాతవర్మ యొకదళవాయి. ఇదియంతయు నొక లెక్కయేగాని నిజమునకు నాయధికారము లధికారములు కావు.

కొందఱు గ్రామాధికారు లుందురు. గ్రామాధికారి యనఁగాఁ బదియూండ్ల కతఁడు ప్రభువు. ఆపది గ్రామములమీఁద సర్వాధికార మతనిది. అతఁ డొకచిన్నపాళెగాఁడు. యుద్ధసమయములం దతఁడు వేయిమంది సైన్యమును జతపఱుపవలయును. ఇట్టి నలుగురుదళవాయులమీఁద నొకసేనాపతి యుండును. ఈదళవాయులందఱుఁ బాళెగాండ్రే కా నక్కఱలేదు. చక్రవర్తి కెవని మీఁదనైన దయ గలిగినచో వానిని దళవాయిని జేయును. భల్లాతవర్మ యిట్లు దళవాయిగాఁ జేయఁబడినవాఁడు. వర్మ యనుటచేత భల్లాతుఁడు క్షత్రియుఁడు కాఁడు. రాజాదరము హెచ్చినకొలఁది గర్వాహంకారములు పెరిగి, యతఁడు చేర్చుకొన్న యుపనామము. భల్లాతవర్మ యన లెవరో, వానిపుట్టుపూర్వోత్తరములు నాఁటిసాయంతనమున నతనికిఁ దెలియు నని' తెలిసెడిచోటునకుఁ దీసికొనిపోదు నని యొకస్నేహితుఁడు మయూరునితోఁ జెప్పెను.

ఆనాఁడు సాయంకాలము మయూరుఁ డాస్నేహితుని గలిసికొనెను. ఆస్నేహితుఁడు కాంచీనగరములో రాజమార్గము లన్నియు వదలి సందుగొందులవెంటఁ దీసికొనిపోయెను. దుర్వాసనాభూయిష్ఠమైన యొకసందులో నాస్నేహితుఁడు మయూరు నొకయింటిలోనికిఁ దీసికొనిపోయెను. అది యొకపూఁటకూటి యిల్లు. లోనికిఁ బోగా నచ్చట నొకస్త్రీ కనిపించెను. ఆమె రథ మంత యున్నది. చెవితమ్మలు బరువుగల కర్ణాభరణములు నిత్యముఁ దాల్చుటచే నంగుళమంత కైవారముగల బెజ్జము కలవిగా నుండెను. కారుతమలపాకులు, పచ్చివక్క, కాఁచు-

వీనియొక్క మేలుకొన్న నాలుఁగుజాముల నిరంతరచర్వణము వలన నామెదంతములు వర్షకాలమేఘసదృశములుగా నుండెను. ఆమె నల్లని కరిమొద్దు. కన్నులు చింతనిప్పులు. ఆమెమెడలోఁ, జేతులయందు బంగారపునగ లెన్నియో కలవు. మొగమునఁ గుంకుమబొట్టు క్రిందఁ గనుబొమలు, పైసిబాపట యిఱుదెసల యందు దలవెండ్రుకలను దాకుచుండును. ఆమెమొగ మది యొక చిత్రము. కన్నులక్రిందినుండి గడ్డమువఱకు కొబ్బరి బొండమంత యుండెను. ఫాలము, మొగము పసిపిల్లవాని చేతిబెత్తె డుండదు. ఆమెశరీరమంతయు మొగములోఁ గ్రింది భాగమున కనుగుణముగా నుండెను. సరస్వతీదేవి నిత్యవీణా పాణి, ఈమె నిత్యతాంబూలపాణి. ఆమె యాబల్లపైఁ గూర్చుండి వర్షకాలపు మండూకధ్వనితో నింటిలోఁ బనిచేయు వారిమీఁద నధికారముఁ జేయుచుండెను. మయూరుఁడును, స్నేహితుఁడును నామెవద్దకుఁ బోయిరి. ఆమె 'మీరు బ్రాహ్మ ణులు కాబోలును. ఇది బ్రాహ్మణులబస కా' దనెను. వా రందు కోసము రాలే దనిరి. మఱియెందుకోస మనఁగా మయూరుఁడు భల్లాతవర్మ నాశ్రయించి యొకయుద్యోగము సంపాదించు కొనుటకు వచ్చెను. ఆమె భల్లాతవర్మతో మయూరునిగూర్చి చెప్పవలయు నని స్నేహితుఁడు చెప్పెను. ఆమె యీమాటలు వినినంతనే 'అబ్బో! వాఁడు నామాట యిప్పుడు వినునా? నాసొమ్ము తిన్నన్నినాళ్లుఁ దినెను. పెద్దయుద్యోగము దొరికి నది. రాజాశ్రయము లభించినది. మఱల నావంకఁ జూచునచో నొట్టు' అనెను. మయూరుఁడు " ఆయన మీకుమారుఁడని

విన్నానే' యనెను. ఆమె వాఁడు నా కేమికొడుకు? ఎక్కడనో దొరకెను. తీసికొనివచ్చి పెంచితిని, చదువుఁ జెప్పించితిని. అల్లరిచిల్లరిగఁ దిరుగుచు గరిడిశాలలోనికిఁ బోయి కత్తిసాము, కఱ్ఱసాము మొదలైనవి నేర్చుకొనె' నని చెప్పెను. ఇంతవఱ కామె భల్లాతవర్మ యన్నచో నిరాదరణగా మాటాడెను. ఇక్కడ నుండి యభిమానమంతయుఁ దఱుముకొనివచ్చినటుల మఱలఁ బ్రారంభించెను. 'అయ్యా! మాభల్లాతయ్య చాలగొప్ప వీరుఁడు. కత్తిసాములో నతనిని మించినవాఁడు లేఁడు. వాఁడు చేతితోఁ గత్తి పుచ్చుకొన్నచో నందఱును బాఱిపోవలసినదే. వానియందు రాజునకు దయ గలిగిన దనఁగానేల గలుగదు? అసలారాజునకు బుద్ధియున్నచో మావానిని దళవాయిగా నుంచునా? సర్వసేనాధిపతిని జేయవలయు' ననెను. మయూరుని స్నేహితుఁడు 'ఏమమ్మా! ఆయన కుద్యోగ మైనతర్వాత నీవంకనే చూడలే దంటివి. అతఁడన్నచో నీ కంతయభిమాన మెందుల' కనెను. అనఁగా నామె యిట్లనియెను. 'పోనిలే యయ్యా! పోనీ. పెంచితిని, పెద్దవానిని జేసితిని. ఎక్కడోయక్కడ గొప్పగా బ్రతుకుచున్నాఁడన్నదే చాలును. ఆదళవాయివేషముతో నా కొక్కసారి కనిపించినచోఁ జూడవలయునని యున్నది. అతనికిఁ బరువునష్టమఁట! ఓయి నాయనా! అర్థరాత్రమునం దైన నొకసారి వచ్చి కనిపించి పొమ్మని కబురు పంపితిని. రాలేదు. అడ్డాలనాఁడే బిడ్డలుగాని, గడ్డాలునాఁడు బిడ్డలా? యనెను. మయూరుఁడు 'నీ వతనిని బాలిచ్చి పెంచితివా? నీ కతఁ డడ్డాలనాఁడును బిడ్డ గా' డనెను.

మయూరుఁడు మఱియు మఱియుఁ బ్రశ్నలు వేసెను. చివరకుఁ దేలిన సారాంశ మే మనఁగా భల్లాతవర్మ వాని కెని మిదవయేట నీస్త్రీకి దొరకెను. అతఁడు లంబాడివాండ్ర పిల్లవాఁడు కావచ్చునేమో! ఈసంగతి నాముసలిది సరిగా నొప్పుకొనలేదు.

భల్లాతవర్మ రాజధానికి దక్షిణదిశ నొకపెద్దభవనములో నివాస ముండెను. అతనిని జూచుటకుఁ బోయినవాని కతఁడు దర్శనమే యియ్యఁడు. కాని మయూరుఁడు పోకతప్పదు. మఱునాఁటిప్రొద్దున మయూరుఁడు భల్లాతవర్మయింటికిఁ బోయెను. వాకిట నిద్దఱు సైనికు లుండిరి. ఒకఁడు వెడల్పయిన మృదువైన రాతిమీఁద నొకఖడ్గమును నూరుచుండెను. రెండవవాఁడు గోడ కానుకొని కూర్చుండి యేదో పాడుచుండెను. మయూరుఁడు కత్తినూరువానిని 'దళవాయిగారున్నారా?' యని యడిగెను. వాఁడు తల యెత్తియే చూడలేదు. ఇతఁ డక్లే కొంత సేపు నిలుచుండెను. కత్తి నూరుటయైనతర్వాత వానిదారిని వాఁ డింటిలోనికిఁ బోయెను. మయూరుఁడు సంగీతము తీయుచున్నవానియొద్దకుఁ బోయి, దళవాయిదర్శనము నాకుఁ జేయింపు మనెను. అతఁ డే మిత్తు వనెను. మయూరుఁ డాశపెట్టెను. వీరిద్దఱిమధ్య కొంతప్రసంగము సాగెను. ఆసంగీతముపాడువాఁడు వట్టిప్రేలుఁడుకాయ. వాని నొక్కటి యడిగినచో వంద చెప్పును. పదినిముసములలో నిద్దఱకు మిక్కిలి స్నేహ మయ్యెను. మయూరుఁడు వానిచేతఁ దెగవాగించెను. ఆవాగుడులో వాఁ డనేకములు చెప్పెను. 'యుద్ధములో నే నెప్పుడును దళవాయివద్దనే యుందును. నేను దళవాయికొలువులోఁ జేరి పదియేం డ్లయి

నది. ఆరోజులలోఁ బల్లవరాజుసైన్యము శాతవాహనరాష్ట్రము మీఁద దాడిపోయెను. మాదళవాయిక్రింద వెయ్యి యాటవిక సైన్య ముండెను. ఆశాతవాహనరాష్ట్రప్రజలు దుర్మార్గులు. చిన్నచిన్న దళములుగాఁ జేరి మాసైన్యములు చెదరుగా దొరికినచో నెక్కడవారి నక్కడ నఱకెడివారు. దానిమీఁద మేము వారికి బుద్ధిఁ జెప్పితిమి. ఓహో! యెన్నియూళ్ళు తగులఁబెట్టితిమి! ఎంతమంది యాటవికులను వశము జేసికొంటిమి! ఎంత ధనము దోఁచుకొంటిమి! నిజముగా నా కుద్యోగము చేయవలసిన యవసరము లేదు. ఆశాతవాహనరాష్ట్రములోనే నా కింత ధనము వచ్చెను.' మయూరుఁడు 'మీరు దోఁచిన యూళ్ళపే ర్లేమైన జ్ఞాపక మున్నవా' యనెను. వానికి జ్ఞాపకము లేవు. మయూరుఁడు మఱల 'నంతఘోరము చేయుటకు మన సెట్లొప్పెను? దానికేమిలే. అప్పు డస లొడలే తెలియదు. మఱి యేదైనా నూరిలో, మఱి యేదైన నింటిలో నున్నవారి నందఱను జంపితిరా?' యనెను. వాఁడు సమాధానము చెప్పెను 'ఇంటిలో నందఱను జంపిన స్థలములు పెక్కు లేవు. నాలుగైదూళ్ళలో మాత్ర మట్లు చేసితిమి. సైన్యము పోవుదుము. అందఱు తలొక చోటికిఁ బోవుదురు. నేను మాదళవాయితోఁ గలసి నాలుగైదు చోట్లకే పోయితిని. మాదళవాయి మిక్కిలి కోపి. అబ్బో! పగ పట్టినచోఁ ద్రాఁచుపాము. ఆయింటివాండ్రు మాటాడకుండ ధన మంతయు నొప్పగించినచో, స్త్రీలనుమాత్రము చెఱచి వచ్చివేసెడువాఁడు. ఆయింటిలోని పురుషు లేమాత్రి మెదురు తిరిగినను బసిబిడ్డబాలాది మెడలు కోసెడివాఁడు. ఒకయూరిలో

నాకు బాగుగా జ్ఞాపకము - ఒకతల్లియు, గూఁతురు, గృహ యజమాని, ముగ్గురో నలుగురో మునలివాం డ్రుండిరి. ఆ గృహయజమాని, తనభార్యాపుత్రికల మానభంగము చూడలేక కత్తి పుచ్చుకొని యెదురు తిరిగెను. మాదళవాయి వానిని జుట్టు పట్టుకొని బైటి కీడ్చి, వాకిటిలో మెడ నఱకెను. అప్పుడు మాత్రము నాకు మనస్సు చాల కష్ట మనిపించెను.' మయూరుఁడు నివ్వెఱపోయెను. తాను వెదకివెదకి యడిగియడిగి చివర కీమాటఁ జెప్పించుకొనుటకా ? అదియునుగాక యది తన కుటుంబమే కావలసిన యవసర మే మున్నది ? వందయూళ్ళను వీరు తగులఁబెట్టిన, వందయూళ్ళలో నిట్టి వెన్నిచోట్ల జరుగరాదు ?

---

## పంచమాధ్యాయము

మయూరుఁడు బయలుదేరి భల్లాతవర్మయింటికిఁ బోయెను. భల్లాతవర్మ యే సమయమునందు నింటివద్ద నుండునో యవి యన్నియును గనుగొనియే పోయెను. తనవల్ల లాభించు ననుకొన్న సైనికుఁడు మయూరునకు భల్లాతవర్మ దర్శనము తప్పకుండఁ జేయింతు నని చెప్పెను. మయూరుఁ డచ్చటికిఁ జేరిన సమయములో భల్లాతవర్మ వాకిట నొకతివాసీపైఁ గూర్చుండి యుండెను. ఆదినములలో ధనవంతు లొకమాదకపదార్థము త్రాగుచుం డెడివారు. భల్లాతవర్మ యది త్రాగుచు సైనికులతో ముచ్చటించుచుండెను. మయూరుఁడు కనిపించినంతనే యతని దర్శనము చేయింతునన్న సైనికుఁడు కనుసైగ చేసి సమీపింపు మనెను. మయూరుఁడు దగ్గరకు వెళ్ళెను. ఇతనిని జూచి భల్లాతవర్మ యితఁ డెవ్వఁ డనెను? ఆసైనికుఁడు 'ఇతనిది మాయూరు. వీరు బ్రాహ్మణులు. తమరు వీరి కేదైన నుద్యోగము నిప్పించవలయు' ననెను. మయూరుఁడు పిడుగుపడ్డట్లు వెంటనే యి ట్లనెను. 'అయ్యా! మాది వీరి గ్రామము కాదు. మాది శాతవాహనరాష్ట్రము. స్థానాకోడూరు. నా కిప్పుడు పదు

నెనిమిదేండ్లవయస్సు. నా కెనిమిదేండ్లవయస్సప్పుడు పల్లవరాజు యొక్క యాటవికసైనికులు మాయూరు తగులఁబెట్టి, మాయింటికివచ్చి, నాతల్లిని, నాయప్పగారిని మానభంగము చేసి యడ్డము వచ్చిన నాతండ్రిని దలపట్టి యీడ్చి మావాకిటిలోననే నఱకెను. అప్పటినుండి నేను దిక్కులేని పక్కినై తిరుగుచుంటిని. మహాప్రభువులు. తమదర్శన మైనఁ జాలు నని తహతహ లాడితిని. ఇన్నాళ్ళకుఁ దమదర్శన మైన' దనెను. భల్లాతవర్మ సమాధానము లేదు. మయూరునివంక నట్లే చూచుచుండెను. ప్రక్కనున్న సైనికుని పైప్రాణములు పైనిఁ బోయెను. నిన్నసాయంతనమున నతఁడు మాటాడినదంతయు నితఁ డొప్పజెప్పిన ట్లుండెను. ఇటువంటివానిని దీసికొనివచ్చినందులకుఁ దనయజమాని తన్నే మనునో ? ఈమయూరుఁడు నిజముగా వారికొడుకేనా ? ఇతఁడు కల్పించి చెప్పెనేమో ? అయినను దళవాయివద్దకు వచ్చి యి ట్లెవఁడు చెప్పును ?'

కొంతసేపటికి భల్లాతవర్మ కారణము లేకుండఁ గోపము తెచ్చికొని 'యయినచో నన్నేమి చేయు మందు' వనెను. మఱి కొంతసేపాగి 'నీతండ్రి నెవరో చంపి రంటివిగదా ! అది నీవు చూచితివా ? ఎవరో చెప్పినచో వింటివా' యనెను. మయూరుఁడు 'నేను నాకన్నులతోఁ జూచితి' ననెను. భల్లాతవర్మ పకాలున నవ్వి 'యోయీ ! నీ వచ్చట నున్నచో వారు నిన్నును నఱకెడివారే ! నీ వచ్చటలేవు. పో' మ్మనెను. మయూరుఁ డి ట్లనెను. 'నేనచ్చటనే యుంటిని. మాయింటిప్రక్కనే పిడుకల గుడిసె యున్నది. దాని నానుకొని చొప్పగూ డున్నది. ఆరెంటి

నడుమ చిన్నసందున్నది. నే నాసందులో దూరియుంటిని. ఆరాక్షసుఁడు చేసిన పనియంతయుఁ జూచుచునే యుంటి' ననెను. భల్లాతవర్మ మిక్కిలి వెకిలిగా నవ్వి యిట్లనెను. 'అరరే! ఏమి మగవాఁడవోయి! తల్లిని, అప్పగారిని జెఱఁబట్టఁగాఁ, దండ్రిని జంపఁగాఁ జూచుచు నూరకుండిన మగతనమన్న నీదే మగతనము. అట్లు చేతఁగాక యూరకయున్నది చాలక చెప్పు కొనుచుంటివికూడ' ననఁగా మయూరుఁడు 'నా కప్పు డెనిమిది యేం' డ్లనెను. భల్లాతవర్మ 'యెనిమిదేండ్లయినచో నీ కిది యంతయు నెందులకు? అప్పుడు నీకేమియుఁ దెలియదుకనుక నీ వట్లనుకొంటివి. నిజాని కెవరో చెప్పినమాటగాని, నీ కేమి తెలియును? పల్లవచక్రవర్తి చాల సత్పురుషుఁడు. తనసైనికుఁ డట్లు చేసినచో నూరకుండఁ' డనెను. మయూరుఁడు 'అనియే నేనును విన్నాను. రేపు చక్రవర్తివద్ద నే నభియోగము తేఁబోవు చున్నాను. మీచక్రవర్తియొక్క ధర్మాభిరతి రేపు తేలఁగల' దనెను. భల్లాతవర్మ యెవరు చేసి రని 'యభియోగము తెచ్చెద' వనఁగా మయూరుఁ 'డెవరు చేసిరనియా? నాతండ్రిని నఱకు చుండఁగా నెవనిరాక్షసవదనము నేను చూచితినో, యేవదనములో నున్న మహారాక్షసత్వ మానాఁడుమొదలు నేను విస్మరింపలేదో, యీపదియేం డ్లెవనిని వెదకితినో, యేడాదిక్రింద వాఁడు నాకుఁ గనిపింపఁగా వాఁడౌనో, కాదో బాగుగాఁ బరిశీలించుటకు వాని నుద్యోగ మిమ్మని యడుగుటకుఁ బోయితినో, వాఁడు మాయూరి వద్ద నొకపట్టణములో నుండఁగా నేను గత్తిసాములో నేర్పరిని, నావిద్యలో నేర్పు చూ ని యడిగితినో, వానిని వెదకికొనుచు

నీకాంచీపురము వచ్చితిని. వానితోఁడునీదవంటి యీసైనికుని ముఖమున నిన్నసాయంకాలమున వాఁ డీపని చేసె నని ఋజువు చేసికొంటిని. ఆభల్లాతవర్మమీఁద నభియోగము చేసెదను. నాకువీఁడే సాక్షి. నిన్ననెల్ల వానిస్వభావమును నేను గుర్తు పట్టితిని. వాఁ డెంతక్రూరుఁడైనను వాఁ డబద్ధమాడఁడు. వాఁడు సాక్ష్యము చెప్పులోపల నీవు వానిని జంపినచో నేను చెప్పలేను కాని, చక్రవర్తియెదుట వాఁడు యథార్థము తప్పక చెప్పును.'

ఈమాటలు మయూరుఁ డనుచుండఁగా భల్లాతవర్మ దిగ్భ్రాంతుఁడై వినుచుండెను. మయూరుఁడు తాను మాటలాడిన వెంటనే చరచర వెడలిపోయెను. యజమానుఁడును, సేవకుఁడు నిద్దఱును బొందిన దిగ్భ్రాంతి మయూరుఁడు నాల్గుధనుస్సుల మేర పోయినంతవఱకు వీడలేదు. అప్పటికి భల్లాతుఁడు వికావిక నవ్వి 'యోరీ ! బాపనకుఱ్ఱవాఁడా ! నిన్నుఁ బ్రాణములతో వదలి పెట్టితిని పో ! భల్లాతవర్మ వట్టిదళవాయి కాఁడు. సర్వసేనాధి పతియంతవాఁడు. నిన్ను దయఁ జూచితిని. పో' మ్మనెను. కాని ప్రక్కనున్న సైనికుఁడు మయూరుని వెంబడించెను. అతఁడు వెంబడించుటఁ జూచి మఱియిద్దఱు సైనికు లతనివెంటఁ బడిరి. వీరు ముప్వురును బోయి మయూరుని జుట్టుముట్టిరి. మెఱపు మెఱసినంతలో మయూరుఁడు నడుమునకుఁ జుట్టిన పట్టాకత్తి రివ్వున లాగి తళుక్కున మెఱపించి జాగ్రత్తయని యొక విచిత్ర చంక్రమణము చేసెను. ఆ ముప్వురును వెనుకకుఁ దగ్గిరి. మయూరుఁడు తనదారిని దాను బోయెను.

ఆయూరిలో మనుజునితోమాటాడుటకు, వారియు లెక్కడ వీరియు లెక్కడ నని కనుగొని మాటాడుటకుఁ బడ్డంతకష్టము మయూరుఁ డభియోగము తెచ్చుటకుఁ బడలేదు. ఆకాలమున ననఁగా నిప్పటికిఁ బదునేఁడువందల సంవత్సరములకుఁ బూర్వము దేశమంతయుఁ •ప్రాకృతభాష మాట్లాడఁబడుచుండెను. ఈ ప్రాకృతభాష భిన్నప్రాంతములయందు భిన్నమైన ప్రాంతీయ భాషలుగా మారి యొకరిభాష యొకరికిఁ దెలిసెడిది కాదు. ఈప్రాకృతభాషలు భారతదేశమునందలి యుత్తరదిగ్భాములఁ దమసంస్కృతస్వరూపమును బూర్తిగా దించుకొనలేదు. దక్షిణ భారతమున మిక్కిలిగా మారిపోయి యీప్రాకృతము సంస్కృత జన్యమే కా దనిపించుకొనున ట్లుండెను. భాషాశబ్దములు సముద్రతరంగములవంటివి. జలమంతయు నొకటియే యైనను నిప్పుడు వచ్చిన తరంగస్వరూపము వేఱు. మఱికొంత సే పాగివచ్చిన తరంగస్వరూపము వేఱు. ఒకతరంగములో వచ్చిన కొన్నిశబ్దము లెక్కువ మార్పు పొందును. ఒకచోట నెక్కువమార్పు పొందును. కొన్నికోట్ల సంవత్సరములుగా నీదేశ మున్నది. చరిత్రకుఁ గొన్నివేల సంవత్సరములుమాత్రమే తెలియును. చరిత్రకుఁ గొన్నివేలుకూడఁ దెలియవు. కొన్నివందలే తెలియును. అనంతకాలముమీఁద నీరీతిగాఁ బలుమార్పులుపొందిన యాసంస్కృతశబ్దములు ప్రాకృతములై మఱి యితరభాషలై పరిణమించుచుండెను. కాని పల్లవరాజు శివస్కంధవర్మవఱకుఁ బ్రాకృతమే రాజభాషగా వాడిరి. కాంచీప్రాంతమందలి ప్రాకృత మప్పటి రాజభాష. కాని, శివస్కంధవర్మ తనపూర్వరాజులవలె సర్వ

దిగ్విజయము చేసినవాఁడు కాఁడు. అశ్వమేథాదియాగములు చేసినవాఁడు కాఁడు. వారికంటె గొప్పపండితుఁడు. సంస్కృత భాషాభిమానము కలవాఁడు. అందుచేత తన రాజ్యములో సంస్కృతభాషయే రాజభాష చేసెను. సర్వవ్యవహారములు సంస్కృతభాషయందే జరుపఁబడుచుండెను. అందుచేత మయూరున కభియోగము చేయుపని తేలిక యయ్యెను.

ఈపని రామశర్మ కేమియు నిష్టము లేదు. 'ఓరి పిచ్చి వాఁడా! భల్లాతవర్మ చక్రవర్తికిఁ గుడిభుజమువంటివాఁడఁట! ఇది ఫలదాయకమైన పని కాదు. ఈ యనంతమైన మానవ ప్రపంచమున నీయనంతమైన కాలములో నోయీ! ఏజీవి కెట్లు వ్రాసినదో, యెవరిమరణ మెట్లుండునో, యెవఁడు సముద్రము పొంగి యుప్పెన వచ్చి మునిగిపోవునో, యెవఁడు కొండకొమ్ము విరిగి శిరస్సునఁబడి నశించునో, యెవఁడు భూకంపము కలిగి చీలిన నేలముక్కలలో నలిగిపోవునో, యెవఁడు రాజకీయ విప్లవము పుట్టి మారణమగునో మన మేమి చెప్పఁగలము? ప్రతి దానికిఁ బ్రతిక్రియఁ జేయఁ బూనినచో సాధ్యమే కాదు. ఆప్రతి క్రియ భగవంతునిచేతిలో నున్నది' యని యనంతకాలసంబంధి యైన బ్రాహ్మణబుద్ధి కనుకూలముగా మాట్లాడెను. మయూరుఁడు తత్కాలబుద్ధియుఁ, బురుషకారము రూపొందినతనమును బ్రదర్శించి, తాను ప్రతిక్రియ చేయుదు ననెను. పురుషకారము తత్కాలసంబంధి. దైవ మనంతకాల సంబంధి. రామశర్మ యటు లాగును. మయూరుఁ డిటు లాగును. రామశర్మ కీయభియోగ మనిన వట్టియిష్టము లేకపోవుటయే కాదు. మనస్సునకుఁ గష్టము

కూడ వేసెను. మయూరుఁడు రామశర్మను సాక్షిగా వేసెను. తాను జెప్పుచున్న కథయంతయు నిజమే యని రామశర్మ సాక్ష్యము చెప్పవలయును. పదియేండ్లనుండి మయూరుఁడు తన కొడుకని రామశర్మ ప్రేమ పెంచుకొనెను. ఆప్రేమయంతయు నేఁ డాతనికొడుకుతనము చెడుటతోఁ గూలిపోయిన సౌధమువలె రామశర్మకుఁ దోఁచెను. ఎంత చెప్పినను మయూరుఁడు వినక పోవుటచేఁ దుదకు రామశర్మ యీమాటయే యనెను. 'ఓయి మయూరా! నీవలన నేను నాబ్రాహ్మణ్యమును వదలి పెట్టితిని. గంగ నీమీఁద గంపెఁడాస పెట్టుకొన్నది. చిన్నప్పుడెప్పుడో నీవుసరిగా నెఱుఁగని తలిదండ్రులకై నీకుఁ దెలిసిన తల్లిదండ్రు లను మమ్ము వదలిపెట్టెదవా? ఆనాఁడు స్థానాకోడూరులో మీయొక్కకుటుంబమేమి, నలుబదియేబది కుటుంబము లిట్లు దగ్ధపటలము లయ్యెను. వారందఱు నెవరు ప్రతిక్రియ చేయు దురు? పైఁగా నీప్రతిక్రియావ్యవసాయము బహుశాఖ్యంతర ములు గలది' యనెను. మయూరుఁ డిట్లనెను. 'తండ్రీ! నే నీయభియోగము తెచ్చుటచేత నీవు నాతండ్రివి కాకపోవు దువా? ఆభల్లాతదైత్యుని ముఖమును, క్రూరదృష్టియుఁ, బది యేండ్లు నన్నిట్లు వెన్నాడుటయేల? నేనుగాక మఱియొక్కఁడై నచో నాసంగతియంతయు మఱచిపోయెడువాఁడే. నన్ను భగ వంతుఁడు మరచిపోనీయలేదు. నాచేత నీప్రతిక్రియఁ జేయించు టకేకదా నన్ను మఱచిపోనీయలేదు. పల్లవచక్రవర్తి న్యాయము చేయనిచో నాప్రతిక్రియఁ బల్లవచక్రవర్తి మీఁదనే చెసెద' ననెను.

---

## షష్ఠాధ్యాయము

మయూరుని యభియోగ పత్రమును జూచి సార్వభౌముని యుద్యోగస్థు లందఱు నవ్విరి. అతనికిఁ జక్రవర్తిదర్శనము కావలయును. ఈయభియోగపత్రముఁ జక్రవర్తిచేతి కియ్యవలెను. చక్రవర్తిదర్శనము కాలేదు. ఇతఁడేమి సామంతుఁడా? ఒక దళవాయియా? ఒక పెద్దయితరరాజుల రాయబారియా? ఒక దళవాయిమీఁద నభియోగము ప్రత్యక్షముగాఁ జక్రవర్తితోడనే చేయవలయును. ఆచక్రవర్తి కనిపింపఁడు.

మయూరుఁడు దినదినము రాజుగారి కోటకడకుఁ బోవుచుండును. వచ్చుచుండును. కోటవాకిట నున్న బంటులందఱు మయూరునకు మచ్చికపడిరి. అతఁడు వారందఱకుఁ దినిపించెను. వారిలో నొకఁడు తాను సార్వభౌమదర్శనము చేయించెద నని చెప్పెను. చెప్పెనేకాని పదిదినములు గడచెను. ఈపదిదినములలో మయూరున కొకసంగతి తెలిసెను. తనచాటుమాటున నచ్చటియందఱును దన్ను వెక్కిరించుచుండిరి. ఇతఁ డొక వెఱ్ఱివానిక్రింద వారందఱు జమకట్టిరి. ఇతఁడేమి చేయును?

ఒకనాఁ డొకపెద్దయుద్యోగస్థుఁడు గొప్పసైనికాధికారి వలె నుండెను. అతఁ డొకయుత్తమజాతిగుఱ్ఱముపై నెక్కి మహా రాజదర్శనమునకుఁ బోవుచుండెను. అతఁ డనుజ్ఞలేకుండఁగనే మహారాజువద్దకుఁ బోయెను. తక్కినయంద ఱతనికి వంగివంగి నమస్కారములు చేయుచుఁ దొలఁగి దారి యిచ్చిరి. మయూరుఁ డతని పేరడిగెను. అతనిపేరు వీరవర్మ. ఆయన యొక సేనా పతి. మయూరుఁ డతను తిరిగివచ్చువఱకు నెదురు చూచెను. అతఁడు సార్వభౌమదర్శనము చేసి తిరిగివచ్చువేళకు మయూ రుఁడు వానికిఁ బోయి నమస్కారము చేసెను. వీరవర్మ మయూ రునివంకనే చూడలేదు. మయూరునకుఁ దండ్రిచెప్పినది కొంచెము సంస్కృతమే యైనను, సంస్కృతములో ధారాళముగా మాట్లాడు శక్తి యలవడినది. మయూరుఁడి ట్లనెను. 'ఈరాజ్యములో న్యాయమే లేదా ? ఒకదళవాయి చేసిన దౌర్మార్గ్యమునకు శిక్ష లేదా? న్యాయము పాలించనిచో, న్యాయము పాలింతుమన్న వేషము వేయుట యెందులకు ? న్యాయపుఁజట్టములు, పరిషత్తులు మొదలైన కితవవేషము లెందుకు ? అధికారి తనతో సమానుఁ డైన యధికారితోనో, తనకంటె నధికునితోనో మాటాడును గాని, తనకంటెఁ దక్కువవారితో మాటాడరాదా ? ధనములేని, యధికారములేని మనుష్యుఁడు మనుష్యుఁడే కాఁడా ?' యని విజృంభించెను. వీరవర్మ గుఱ్ఱ మెక్కబోవువాఁ డాగి 'యెవరు నీవు? ఏమి కావలయు' నని యడిగెను. మయూరుఁడు భల్లాత వర్మమీఁది తనయభియోగమునుగూర్చి చెప్పెను. వీరవర్మ యంతయువిని, వికారముగా నవ్వి మఱల గుఱ్ఱము మీఁద

నెక్కెను. గుఱ్ఱము నదలించెను. గుఱ్ఱము ముందడుగువేయు నిముసమునందే చేతిలోని కొరడాకొస మయూరుని మొగము నందు విసరెను. ఆచబుకుచిళ్ళ మయూరుని మొగమునందు చళ్లునఁ



దగిలి వెంటనే యొకపెడ బుసబుస పొంగెను. కన్నుమూసి కన్ను దెఱచునంతలో వీరవర్మగుఱ్ఱము రివ్వున నెగిరి పోయెను. మయూరశర్మ బాధకుఁ జేయి యెత్తి మొగముననైన బెట్టు కొనలేదు. అతని కన్నులు నిప్పులు చెఱగుచుండెను. చుట్టు పట్లనున్న యల్పోద్యోగులు, రాజసేవకులు మయూరశర్మను జూచి యొకటే నవ్వుట.

తరువాతఁ గొంతసేపటికి మయూరశర్మ యిట్లనెను. 'ఓయీ! మీరంద తేల నవ్వెదరు? ఏసార్వభౌముని మీరు సేవించుచుండిరో యాసార్వభౌముని న్యాయ మి ట్లున్నది.

న్యాయ మనఁగా, ధర్మ మనఁగా నెఱుఁగని రాజుకొలువు చేయుటకు సిగ్గుపడ వలసినది బదులా హా! సంతోషించుచున్నారు. మీమనస్సులకుఁ దెలిసిన ధర్మ మిది. 'యథా రాజా తథా ప్రజా'. ఆరాజంతన్యాయస్థుఁడు ; అతనిబంటులు మీరింతన్యాయస్థులు. భల్లాతవర్మయొక్కనిమీఁదనే గాదు నాపగ. ఇప్పు డింకొక్కఁడు చేరినాఁడు. భల్లాతవర్మమీఁద నాతండ్రిపగ. వీరవర్మమీఁద నావ్యక్తిగతమైన పగ. ఇన్నాళ్లు రాజదర్శన మగునని వేచి యుంటిని. మీలో నిజముగాఁ బల్లవరాజన్నచో నెక్కువ గౌరవము, నభిమానము గలవా రుండిరేని, మహారాజున కీసంగతిఁ దెలియఁజేయుఁడు. కాదంబుఁడైన మయూరశర్మ పల్లవరాజు మీఁద గత్తి కట్టినాఁడు. భల్లాతవర్మ వీరవర్మలను నిర్మూలము చేసితీరు నని పెద్దపెద్దయంగలతో మయూరశర్మ నడచి పోయెను. అచట గుమికూడిన జనులందఱు వానిని బరిహాసము చేసిరి. ఒకరిద్దఱిమొగములలోఁ దీక్ష్ణత కనిపించెను.

అనాఁడు మధ్యాహ్నము. పల్లవచక్రవర్తి పాదసంవాహకుఁడైన యొకసేవకుఁడు చక్రవర్తికిఁ బరిచర్యచేయుచుండెను. ఆయనవద్ద మహామాత్యుఁ డుండెను. చక్రవర్తి యాపరిచారకు నడిగెను. 'ఏమిరా! ప్రొద్దుట గోటమొగసాల నేదియో యల్లరి జరిగినదఁట' యని. పరిచారకుఁడు సమాధానముచెప్పెను. 'ప్రభూ! ఎవఁడో బ్రాహ్మణబాలుఁడఁట! అతఁ డిఱువదిదినముల నుండి ప్రభువుల దర్శనము చేయుటకు వచ్చుచున్నాఁడు. ప్రభుదర్శన మెవ్వరును జేయించలేదు. అతనిది శాతవాహన రాష్ట్రము. అతనిగ్రామము స్థానాకోడూరు. పదియేండ్లక్రిందటఁ

ప్రభువుల యాటవికసైన్యములు శాతవాహనరాష్ట్రము మీఁద బడి, శత్రుసైన్యమును నిర్మూలించునపుడు వానితల్లిని అప్పగారిని నీసైన్యము మానభంగము చేసి, యతనితండ్రిని నఱికి చంపెనఁట! ఈపని చేసినది భల్లాతవర్మగారఁట! ఆభల్లాత వర్మగారిమీఁద నాతఁ డభియోగపత్రము తెచ్చెను. అతఁ డీ సంగతి వీరవర్మగారితోఁ జెప్పెను. వీరవర్మగారు తనగుజ్జుపు చబుకుతో నతని మొగమునందుఁ గొట్టెను. ఆబ్రాహ్మణ బాలుఁడు బాధ ననుభవించలేదు. ఏడువలేదు. చివర కనెను గదా! మీలో నిజమైన ప్రభుభక్తిగలవారు ప్రభువులతోఁ జెప్పవలయునని! కాదంబుఁడైన మయూరశర్మ పల్లవ రాజుమీఁదఁ బగ పట్టె' నని.

ప్రధానామాత్యుఁ డిదియంతయు వ్రాసికొనెను. చక్ర వర్తి విని యూరకుండెను. కొంతసేపటి కతనివయ స్సెంత యుండు నని యడిగెను. పదునెనిమిదేం డ్లుండవచ్చునని పరిచార కుఁడు చెప్పెను. చక్రవర్తి మఱల నాబ్రాహ్మణబాలుఁడు వచ్చినచోఁ దనవద్దకుఁ దీసికొనిర మ్మని చెప్పెను.

మయూరశర్మ మఱలఁ గోటగడప త్రొక్కలేదు. తండ్రికొడుకు లిద్దఱును వారున్నసత్ర మాదినముననే వదలి పోయిరి. వా రిప్పటికే కంచిలో నించుమించుగా రెండునెల లుండిరి. కాంచీనగరమంతయు వారికిఁ దెలియును. వారిఱువురుఁ గంచిలో నొకమూల నొకబ్రాహ్మణగృహమున నుండిరి. మయూ రుఁడు బస మార్చెను. తనకోసము రాజభటులు వెదుకవచ్చును. తాను గనిపించరాదు. తర్వాతఁ బదిదినములకుఁ దండ్రిని బం

పించెను. తాను వెనుక వత్తు ననెను. రామశర్మ వెడలిపోయెను. కొడుకుతో 'నాయనా! భద్రముసుమా' యని చెప్పి వెడలి పోయెను.

పల్లవరాజులది వీరశైవమతము. కాంచీనగరమంతయు శైవమతము. మహాసేనాపతి పేరు బుధ్యంకరుఁడు. ఈసేనాపతి పరమశైవుఁడు. జంగమారాధనతత్పరుఁడు. మయూరుఁడు బాల జంగమవేషధారియై యొకనాఁడు బుధ్యంకరుని సౌధమున కేఁగెను. అక్కడ నదివఱకే వందమందిజంగము లుండిరి. అందఱితోఁ బాటు మయూరుఁడు భోజనమునకుఁ గూర్చుండెను. బుధ్యంక రుఁడు భోజనము లారంభించువేళ భస్మరుద్రాక్షధారియై, పంక్తుల వెంట వచ్చెను. ఉన్నజంగములందఱిలో మయూరుఁడు మిక్కిలి చిఱుతప్రాయమువాఁడు. బుధ్యంకరుని దృష్టి మయూరునిమీఁదఁ బడెను. 'స్వామీ! తమరి దేగ్రామ' మనెను. మయూరుఁడు తలయెత్తి బుధ్యంకరునివంక నొకనిముసము చూచి నవ్వి యూరకుండెను.

భోజనములైనతరువాత జంగము లెవరిదారిని వారు పోయిరి. మహాసేనాపతి యాబాలజంగమునిఁ దనవద్దకు రప్పించెను. మయూరుఁడు సేనాపతితో నిట్లనెను. మే మనవ సరముగా మాటాడము. మా కాఱునెలలు శివదీక్ష గలదు. దాని కేమియు వ్యయము లేదు. దినమునకు వందమందిజంగ మారాధన యెక్కడ జరుగునో యాస్థలమందు మాదీక్ష చేయ వలయును. మే మీయాఱునెలలును మాటాడము. ఈదీక్ష మేము చేయునది లోకకళ్యాణముకొఱకు. దీని కొకనిబంధన

యున్నది. ఏగృహస్థుని బవిత్రము చేయుటకు వానియింట మే మీదీక్ష చేయుదుమో, యాగృహస్థుఁడు మేము ప్రతిష్ఠించు శివలింగముముందరఁ బ్రతిదినము రాత్రిపూఁట వచ్చి తనసర్వ వ్యవహారములు మనవి చేసికొని పోవలయును. ఎట్టిరహస్యము లును దాఁచరాదు. దాఁచినచో శివుఁడు కుపితుఁడై యతని యే వ్యవహారమును సాగనీయఁడు. మహాప్రభూ! వందమందిజంగ మారాధన నేను చేయలేను. మీరు మహాసేనాధిపతులు. శివు నకుఁగూడఁ జెప్పరాని రహస్యములు, రాజకీయములు మీవద్ద నుండును. నాదీక్ష మీయింటఁ గొనసాగదు. నే నీసంగతి తమతోఁ జెప్పక తప్పదుగనుక, నామౌనవ్రత మీపదినిముస ములు పరిత్యజించితి' నని తూష్ణీంభావము వహించెను.

బుధ్యంకరునకు బాలజంగముని జూచినంతనే యతఁడే సాక్షాచ్ఛివుఁ డనిపించెను. అతనివిశాలములైన నేత్రములు, తేజో నిధానమైన ముఖము, దబ్బపండువంటి శరీరము, కండలుతీరిన యవయవములు, బుధ్యంకరునకు శివుఁడు బాలవేషమున వచ్చిన ట్లుండెను. ఈబాలయోగికి రాజరహస్యములతో నేమి పని? ఇతఁడు శత్రురాజులు పంపించిన రహస్యచారుఁడా? పల్లవుల కప్పుడు బృహత్పలాయనులతో, నానందులతో యుద్ధములు జరుగుచుండెను. ఆనందులుకాని, బృహత్పలాయనులుగాని, పల్లవచక్రవర్తుల నెదిరించునంత సామంతులు కారు. ఇక్ష్వాకులు మున్నే చిదికిపోయిరి. ఇతనిని జూచినచో నితఁ డాంధ్రుఁడుకాఁడు. ఇక్ష్వాకులు, బృహత్పలాయనులు నాంధ్రులు. ఒక వేళ నిజముగా గృహపతి యా దీక్షాపరునిచేతఁ బ్రతిష్ఠింపఁబడిన శివలిం

గమునెదుట నారహస్యములు చెప్పవలయునేమో? ఆరహస్యములు మఱియెవరు విందురు? ఒక్క యీ బాలజంగము వినును. దానివలన నష్ట మేమి? ఈ బాలజంగముతో నెవ్వరు మాటాడరు. అతఁ డెవ్వరితోను మాటాడఁడు. వలసినచో రహస్యములు దాటిపోకుండుటకుఁ గట్టుదిట్టములు చేయవచ్చును.

బుధ్యంకరమహాసేనాధిపతి యిన్ని విచారించి బాలజంగమును 'స్వామీ! మీదీక్ష మాయింట గొనసాగించుకొనవచ్చును. పరమశివునియెదుట నివేదింపరాని రహస్యములుండునా' యనెను. మయూరుఁడు మఱల నిట్లనెను. 'ఓయీ! మావయస్సు చూచుచుంటివికదా! మేము బాలురము. మా కిదియొకసాధన. మే మొకశత్రురాజుల చారుల మను ననుమానము తగులవచ్చును. మా మీఁద మీరాజాధికారములు ప్రయోగింపరాదు. నే నాఱునెల లిచట నుందు నను నమ్మకము లేదు. ఈ దీక్షాసమయములో నేదైన శివాపచారము నా మనస్సులో నేను జేసినచో, దీక్ష్యావ్యత్యయ మేదైన జరిగినచో దీక్ష వెంటనే పరిత్యజించి మేము మా దారిని బోయెద' మనెను. బుధ్యంకరుఁ డంగీకరించెను. ఆమఱునాఁడే మయూరుఁడు దీక్షాప్రవేశము చేసెను. ఆ దీక్ష కే మియుఁ బెద్దప్రయత్నము లేదు. ఏకాదశరుద్రాభిషేకము, పదికొబ్బరకాయలు కొట్టుట - ఇదియే యారంభము. బాలజంగము దివాభోజనము చేయఁడు. రాత్రిపూఁట గంటసేపు శివలింగము నెదుటఁ గత్తిసాము చేయును. వీరశైవదీక్షలుపలురకములు. అందులో నిదియొకటి కావలయును.

బుధ్యంకరుఁడు దినదినము రాత్రులందు బాలజంగమ ప్రతిష్ఠితశివలింగపురోదేశమునఁ దనదినచర్యయంతయుఁ జెప్పుచుండెను. ఆసమయమున మయూరుఁడు దూరముగాఁ బోయి సర్వాంగాసనముమీఁద నుండును.

## సప్తమాధ్యాయము

బుధ్యంకరమహాసేనాధిపతి దినదినము బాలజంగమప్రతిష్ఠితశివలింగము నెదుట దైనందినమైన తనసర్వవ్యహారములు చెప్పుచుండఁగా మయూరుఁడు దూర మేఁగి, యోగనిష్ఠుఁడై యుండును. పదిదినములు గడుచువఱకు మహాసేనాధిపతి కా యనుమానమే తీరిపోయెను. 'హరా! త్రిపురహర! మహాదేవ! జగదనుభావ! ధూర్జటీ! పాలితకిరీటీ! దినదినము నా



ప్రవర్తన నీయెదుట మనవి చేసికొనుచుంటిని. ఇందుఁ దప్పులున్న నైరింపుము. నన్ను న్యాయమార్గమునఁ బాలింపుము. నాహృదయములోని కల్మషమును గడిగివేయుము.' ఇవి పదు

నొకండవనాఁడు బుధ్యంకరుఁడు నాఁటితనప్రవర్తన శివుని యెదుటఁ జెప్పి, చివర కనినమాటలు. బుధ్యంకరునకు నిది యొక దీక్ష యయ్యెను. బుధ్యంకరుఁడు మహాసేనాధిపతి యైనను, వీర శైవుఁ డైనను, బూర్వ మతని వీరశైవమునందు నాధ్యాత్మిక ప్రవృత్తి లేకుండెను. ఈబాలయోగి నిర్మమత, యతని వైరాగ్యము, నతనిమౌనము - వీనిని జూచినంతనే బుధ్యంకరునకుఁ దనయాత్మలో వెదకికొనుట యను గుణ మలవడినది. అతనికిఁ గ్రమక్రమముగా శివునకును, బాలయోగికిని భేదము లే దని పించెను. ఆశివలింగము స్థావరము, ఈశివయోగి జంగమము. మహాసేనాని మనస్సులో నిద్దఱకు నవినాభావసంబంధము లేర్పడెను. మహాసేనాపతి పద్మాసనమో, మఱియొక యాసనమో వేసి కూర్చుండిన మయూరశర్మదగ్గరఁగూడఁ దనరహస్యములు చెప్ప నారంభించెను. ఈయోగి కేకభుక్తము. అతఁడు శరీరమునందుఁ గృశించఁడు. బుధ్యంకరున కది యొకయాశ్చర్యమయ్యెను. బాలయోగిని బుధ్యంకరుఁ డొకపరీక్ష చేసెను. ఒక సైనికుఁడు కోపముతో వచ్చి బాలయోగిని దీక్ష్ణముగాఁ జూచి 'యోయీ! నీవు బృహత్పలాయనుల రహస్యచారుఁడవు. నీ సంగతి మాకుఁ దెలిసినది. ఇదిగో శిక్ష ననుభవింపు' మని తన చేతిలోని పిడిబాకు రివ్వున మయూరునిమీఁదఁ బ్రయోగించెను. ఆబాకు మయూరుని భుజమునకు బెత్తెఁ డెడముగాఁ బోయి, వెనుకనున్న గోడలో గ్రుచ్చుకొనెను. మయూరుఁడు కదల లేదు. కనుఱెప్ప మూయలేదు. వెంటనే కన్నులు మూసికొని సమాధిగతుఁ డయ్యెను. చాటున నుండి యీప్రయోగము

బుధ్యంకరుఁడు చూచుచుండెను. బాలయోగినైశ్చల్యమాతని కచ్చెరువుఁ గొలిపెను. మయూరుఁడు భగవంతుఁడే యయ్యెను. తర్వాత మూఁడునెలలు గడచెను. మయూరుఁ డొకదినమున బుధ్యంకరునితో నిట్లు చెప్ప మొదలిడెను. 'అయ్యా! మహా సేనాధిపతీ! నాదీక్షకుఁ బ్రత్యవాయము కలిగెను. అయ్యా! మనస్సు చెడ్డదిగద! కడచినరాత్రి నామనస్సు పరమశివునిదాటి పెఱయూహలు పోయె' ననుచునే మయూరుని కన్నులవెంట బొటబొట నీరు కారెను. 'అయ్యా! మా దొక కుగ్రామము. నాతల్లిదండ్రులు నన్ను వివాహము చేసికొమ్మని బలవంత పెట్టిరి. నేనిల్లు వదలి వచ్చి యొకగురూపదిష్టమైన యీదీక్షఁ బొందితిని. ఏయితరభావము వచ్చినను నష్టము లేదు. ఆవివాహ సంబంధమైన యూహలు నామనస్సులోనికి రాఁగూడదు. అది యీదీక్షాభంగము. నా దీక్ష చెడినది. ఓయీ సేనాపతీ! నేను వెడలిపోవలెను. మఱికొంతకాలము గడచినతరువాత వేఱొక చోట మఱియొక ప్రయత్నము చేయవలయును. నీరహస్యములు నాతోఁ జెప్పమనలేదు. నీవే నాతోఁ జెప్పుచువచ్చితివి. మనోలక్షణమువలన నాసంగతులు కొన్ని నాకు జ్ఞాపక మున్నవి. అందులో నొక్కరహస్యముగూడ, నాయాత్మలింగముమీఁద, సాక్షిగాఁ జెప్పుచున్నాను. ఇతరులకుఁ దెలియనీయను. నేను బృహత్పలాయనులకుఁగాని, యానందులకుఁగాని రహస్యచారుఁడను గాను, నే నొకదీనుఁడను. నాబాధ నేను పడుచుంటిని. నీకు విశ్వాస మున్నచో నన్ను వదలివేయుము. లేనిచో నన్ను బందీని జేయుము.'

బుధ్యంకరుఁ డీమాటలు వినినంతనే, బాలయోగికి సాష్టాంగనమస్కారము చేసెను. 'ఓయి స్వామీ! ఈ వయసున నీ కున్న శివభక్తిలో నావయసున నాకు శతాంశములేదు. నీ వొకవేళ నాశత్రురాజుల రహస్యచారుఁడవే యనుకొనుము. నీవు రాజునకుఁ జేయఁగల యాపద యుండదు. నీయిచ్ఛ వచ్చినన్నాళ్లు నాయింట నుండవచ్చును. కానిచో యథాచ్ఛందముగఁ బోవచ్చు' ననెను. మయూరుఁడు మఱల నిట్లనెను. 'అయ్యా! మహాసేనాపతీ! నీమాటలనుబట్టి బృహత్ఫలాయనుల, యానందుల భయము మీకు లేదు. మీ రుత్తర భారతమునుండి దక్షిణాపథముమీఁద దండయాత్ర వచ్చుచున్న సముద్రగుప్తునిమీఁద సమూహముగా నెదురు పోవుచున్నారు. సాలంకాయనరాజులు దక్షిణాపథరాజుల నందఱును గలసి కట్టుగా నుండుఁ డని మీ కభ్యర్థనఁ బంపించిరి. నాకు రాజకీయ విషయములు తెలియవు, కాని నా మనస్సులోని కొకయూహ వచ్చినది. ఈసమయము చూచుకొని మఱియొకఁ డెవఁడైనను మీపల్లవరాజ్యము పొలిమేరలమీఁద దాడి వెడలవచ్చును. మీరు సముద్రగుప్తు నెదిరించుటలోఁ బ్రయత్నపడుదురు. మీ సైన్యములన్నియుఁ దదభిముఖముగా నుండును. ఏచిన్నపాళియగాఁడైనను, బరిమితసంఖ్యాకులైన దోపిడిగాండ్రతో మీ పల్లవరాజుయొక్క రాజ్యపుఁ బొలిమేరయూళ్లు దోఁచుకొనవచ్చును. రాజులు మిక్కిలి దుర్మార్గులు. వారివలన నెప్పు డెవరి కపకారము జరుగునో తెలియదు. ఎవఁడు తనపగ తీర్చుకొనుటకుఁ బ్రయత్నించునో తెలియదు. నా కిది యాశ్చర్యముగా

నున్నది. సంసారము వదలి వైరాగ్యము పొంది శివపాదము లాశ్రయించిన నాకు నీవలన నెంతరాజకీయజ్ఞానము కలిగినది యని మయూరుఁడు చిత్రవిచిత్రముగా నవ్వెను.

మయూరుఁ డానాఁటిసాయంతనముననే వెడలిపోయెను. మయూరుని కాంచీనగరములోని కొందఱు గొప్ప యుద్యోగస్థు లెఱుఁగుదురు. అతఁడు మయూరుఁ డని యెఱుఁగరు. మహాసేనాధిపతియింటిలో శివదీక్షఁ బొందిన యొక బాలయోగిగా నెఱుఁగుదురు. కాంచీనగరముయొక్క దుర్గద్వారమునుండి వెడలి బయటికిఁ బోవుటకుఁ దన్నియమితాధికారి యనుజ్ఞ యుండవల యును. తత్కార్యాధికారి మహాసేనాపతియింట నీబాలయోగిని రెండుమూఁడుసారులు చూచెను. బాలయోగి కాంచీపురమహాదుర్గ ద్వారము నతిక్రమించువేళ నతని యెదుట నదృష్టవశమున నా యధికారి కనిపించెను. ఆ యధికారి బాలయోగికి నమస్కారము చేసెను. దుర్గద్వారరక్షకులు బాలయోగి నడ్డగించలేదు.

తరువాత రెండునెలల కొకపదునెనిమిదేండ్ల బాలకుఁడు రెండువందలమంది సైన్యముతోఁ బల్లవరాజుల గ్రామములు దోఁచుచుండె ననియు, వారు శాతవాహనరాష్ట్రమున నున్న కొండ లో దాగియుండి, తెలియకుండ నెప్పుడో యూళ్ళమీఁద వచ్చిపడి యూళ్ళమీఁద గప్పము తీసుకొందు రనియుఁ బల్లవ చక్రవర్తికి వార్తలు వచ్చెను. ఈ వార్తలు నాలుగైదునెల లదేపనిగా వచ్చెను. మఱియొక వార్త. స్థానాకోడూరు చుట్టు పట్లనున్న పాతికగ్రామములు పల్లవరాజులకుఁ గప్పము కట్టుట మానివేసెను. స్థానాకోడూ రొకకోట యయ్యెను. ఆ గ్రామము

చుట్టును బూర్వమున్న ప్రాకారపు గోడ బలిష్ఠము చేయఁబడెను. ఆ గోడచుట్టును బెద్దకందకము త్రవ్వఁబడెను. ఆ యూరుకెలన నొకవాఁగుండెను. ఆవాఁగు కందకములోనికి మలఁచబడెను. ఆయూరున కొకయోజనము మేర మహాతటాక ముండెను. ఆ తటాకము నిత్యజలభరితముగా నుండెను. ఆతటాకములోని నీరు వాఁగులోనికిఁ బ్రవహింపఁ జేయఁబడెను. ఆచెఱువుకట్ట నాలుగేనుఁగులు నడచిపోఁదగినంత మేర తెగఁగొట్టఁబడెను. ఈ మహాజల మంతయు స్థానాకోడూరునకు దిగువనున్న మఱియొక మహా తటాకములోనికిఁ బ్రవహించు చుండును. ఈ ప్రవాహమువలన స్థానాకోడూరుచుట్టుననున్న కందక మెడతెగని మహాసముద్రము వలె నుండెను. ఈ దోపిడి సైన్యము పల్లవేంద్రనగరముల మీఁదఁ బడును. అచ్చటి యాయుధభోజనసామగ్రులును, ధన మును దోఁచుకొని పోవుదురు. పల్లవేంద్రనగరము లనఁగాఁ బల్లవరాజుల యధికారస్థానములు. ఇప్పటి జిల్లాగ్రామముల వంటివి. తాణాలవంటివి. అవి రాజాధికారమునకుఁ గూడలులు. దేశము చిన్నచిన్న నాడులుగా నుండును. ఒక్కొక్కనాడునఁ బదిగ్రామము లుండవచ్చును. ఇట్టి పదిపదునొకండునాడులు కలిసినచో నొకరాష్ట్రమగును. ఒకనాడునకు నొకపెద్దగ్రామము పల్లవేంద్రనగరము. ఒకరాష్ట్రమునకు నొక పల్లవేంద్రమహా నగరము. రాజభాగము పదిగ్రామములది పల్లవేంద్రనగరము నకుఁ బోవును. అచ్చటినుండి పల్లవేంద్రమహానగరమునకుఁ బోవును. పల్లవేంద్రమహానగరములనుండి సంవత్సరమునకు రెండుసార్లు కాంచీనగరమునకుఁ బ్రోగుచేసిన కప్పమంతయు

రెండువందలసేన సహాయముగాఁ దీసికొనిపోఁబడును. ఇట్టి పల్లవేంద్ర మహానగరములు శాతవాహనరాష్ట్రమునఁ బది యున్నవి. పల్లవేంద్రనగరములు నూటపాతికపైని నున్నవి. పల్లవేంద్ర నగరమున రెండువందలమంది రాజసైనికు లుందురు. పల్లవేంద్ర మహానగరమున వేయిమంది యుందురు. ఈదోపిడిగాని యధీనములో మూఁడు నాడు లప్పుడే చేరినవి. ఈమూఁడు పల్లవేంద్ర నగరములలో నున్న యాఱువందలమంది పల్లవసేనలో వంద మందియే నిజమైన పల్లవులసేనలోనివారు. తక్కిన యైదువందల మందియుఁ దత్ప్రాంతీయులై యాసేనలోఁ జేరినవారు. వారందఱు మయూరుని సైనికులైరి. ఇప్పుడు మయూరుని సైన్యము వేయిమంది.

కాంచీనగరమునుండి నిరాళ యను పల్లవేంద్రమహానగరాధికారి కాదోపిడికాండ్ర నరికట్టవలె నని యాజ్ఞ వచ్చెను. వైజయంతీ నగరములో రెండువేల పల్లవసైన్య ముండెను. అందులో వేయిమంది నిరాళాగ్రామమునకు వచ్చిరి. నిరాళా మహాగ్రామమునందలి వేయిమందియు, నీవేయిమందియు స్థానాకోడూరుమీఁదికి బయలుదేరిరి. స్థానాకోడూరునుండి నిరాళకైదుదినముల ప్రయాణము. ఈరెండువేల సైన్యములో నాల్గువందలమంది శాతవాహనరాష్ట్రీయులు. వీరిలో మూఁడు వందలమంది వైజయంతీనివాసులు. ఈనాల్గువందలమందియు నాలుఁగుదళములు. ఈదళములయొక్క యధికారులు శాతవాహన రాష్ట్రీయులు కారు. ఈరెండువేలమంది స్థానాకోడూరును ముట్టడించిరి. ఈశాతవాహన రాష్ట్రీయులైన నాల్గువందలసేనయుఁ

దమకు శాతవాహనరాష్ట్రియుఁడే యధికారిగా నుండ వలయునని యొకవిప్లవము లేవఁదీసిరి. దీనితో రెండుదినములవఱకు స్థానాకోడూరు ముట్టడి యారంభింపఁ బడలేదు. ఈ రెండు దినములలోఁ బల్లవేంద్రమహానగరాధిపతి కొకవార్త తెలిసెను. స్థానాకోడూరులో నెవ్వరును మనుష్యులు లేరు. లోపల సేనలేదు. కోటతలుపు లూరకే వేసియున్నవి. నిరాటంకముగాఁ బదిపడవలమీఁదఁ గొంతసైన్యము పోయి, ప్రాకారపుఁదలుపులు త్రోసి లోనఁ జూచిరి. ఊరిలో నొక్కపురుగు లేదు. అతఁడు కొంచెము సాధువు. అట్టియూరు తగులఁబెట్టి యేమి లాభము ? మఱలఁ దనసైన్యముతోఁ దిరిగిపోయెను. ఈతిరిగి పోవుటలోఁ దనరెండువేల సైన్యములో





రెండుకక్ష లేర్పడెను. శాతవాహన రాష్ట్రీయులకుఁ బల్లవుల దళవాయులక్రింద నుండుట కిష్టములేదు. వీరేశ్వరుఁ డీయల్లరి యేల నని యానాల్గువందలమంది నొక శాతవాహనరాష్ట్రీయుఁ డైన దళవాయి క్రిందనే యుంచెను. ఏమి జరుగుచున్నదో యెవ్వరికిని దెలియలేదు. మఱల నాలుదినములకు సైన్యమంతయు నిరాళా నగరము చేరెను. అప్పటి కీసైన్యము నిరాళా నగరము వదలి పదునేనుదినము లయ్యెను. ఆనగరము కొద్దిలో నొక చిన్నదుర్గము. స్థానాకోడూరు ముట్టడించుట లేదు. వీరేశ్వరునకు నిరాళాదుర్గము ముట్టడించవలసివచ్చెను. లోన వేయి మందిసైనికు లుండిరి. దుర్గరక్షణ కన్నికట్టుదిట్టములు చేయఁబడి యుండెను. మయూరునిసేనయంతయు లోనఁ జేరెను. ఈ మయూరుఁ డెవఁడో యఖండుఁడు. అతనికి రాజరహస్యము లన్నియుఁ దెలియును. అతనికి రహస్యచారు లుండిరి. వీరేశ్వరుఁడు నిరాళానగరమును వదలిన మఱునాఁడే మయూరుఁడు నిరాళానగరము నాక్రమించుకొనెను. వీరేశ్వరుఁడు చక్రవర్తికి వార్తఁ బంపెను.

——— ———

# అష్టమాధ్యాయము

తిరిగి వచ్చుసరికి నిరాశానగరము మయూరుని యధీనములోనున్న దనుటతోనే వీరేశ్వరుని సైన్యములోని శాతవాహన రాష్ట్రీయులు వీరేశ్వరునియాజ్ఞల నుల్లంఘించిరి. వీరేశ్వరుఁడు నగరము ముట్టడి వేయవలయునా, వలదా యను ప్రశ్న పుట్టెను. పల్లవసైన్యమునకుఁ జుట్టుపట్ల గ్రామములలో మంచితీర్థము పుట్ట లేదు. పల్లవసైన్యము ధార్ష్ట్యము చేసినచో శాతవాహన రాష్ట్రీయులైన సైన్యముతో యుద్ధము తప్పన ట్లయ్యెను. అప్పుడు కోట లోని సైన్యముకూడ బయటకు వచ్చి శాతవాహన రాష్ట్రీయుల నాదుకొనునట్లు కనిపించెను.

వీరేశ్వరుఁడు నాలుగైదు పల్లవేంద్రనగరములకు వార్తలు పంపించెను. చక్రవర్తి కింకొకవార్త పంపించెను. ఏ వార్తయును జేరునట్లు లేదు. మయూరుని రహస్యసైన్యము సర్వమార్గముల నరికట్టెను. ఆరహస్యసైన్యము వీరేశ్వరుని వార్తాహరుల నెచ్చటివారినచ్చట నఱికివేసిరి. నిరాశానగరమునందలి పల్లవ సైన్యమునకుఁ దిండి లేకపోయెను. ఇట్లు మూఁడుదినములు గడచినంతనే పల్లవసైన్య మెచ్చటివా రచ్చటఁ బాఱిపోఁజొచ్చిరి.

వారముదినములలో నిరాశానగరమునఁ బల్లవసైన్యము లేదు. వీరేశ్వరుఁడు మిగిలిన సైన్యమును వెంటఁ దీసికొని వైజయంతికి బయలుదేరెను. శాతవాహనరాష్ట్రపరిసరరాష్ట్రములకు వైజయంతీనగరము సార్వభౌమాధికారస్థానము. అచ్చటికిఁబోయి వీరేశ్వరుఁ డచ్చటి మహాధికారితో జరిగినసంగతి యంతయు విన్నవించుకొనెను. ఆయధికారి వీరేశ్వరునిమీఁద మండి పడెను. 'నీవు స్థానాకోడూరుమీఁదికిఁ బోవుచున్నపుడు నిరాశానగరము నరక్షకముగా నేల గావించితి' వని కోపపడెను. కాని వీరేశ్వరుఁడు నిరాశ నరక్షకముగా నుంచలేదు. కొంత సైన్యము నుంచియే పోయెను. కాని వారు మయూరుని సైన్యముముం దాఁగలేకపోయిరి. పట్టణప్రజలందఱు మయూరునిపక్ష మైరి. లోనున్న కొలఁదిమంది పల్లవసైన్యము చేయునది లేక పోయెను.

ఈసారి పల్లవచక్రవర్తికిఁ బెద్దవార్త వెళ్ళెను. ఇపుడు పల్లవచక్రవర్తి కాంచీనగరములో లేఁడు. ఆయన వేంగీపురమునం దుండెను. పల్లవచక్రవర్తి మహాసైన్యము లన్నియు వేంగీనగరపరిసరములలో విడిది చేసియుండెను. సముద్రగుప్తుని దండయాత్ర కెదురు చూచుచుండెను. ఈసమయములో శివస్కంధవర్మ మయూరునిఁమీదికి సైన్యము నెట్లు పంపించగలఁడు? పంపించినచో నెవరిని బంపించవలెను?

ఒకనాఁడు శివస్కంధవర్మ తా నొంటరిగాఁ గూర్చుండెను. 'ఇతఁడు కొదంబుఁడైన మయూరశర్మయా?' అప్పుడాయన పాదసంవాహకుఁడైన తొలినాఁటి సేవకుఁడు దగ్గఱనే యుండెను.

అతఁ డిట్లనెను. 'మహాప్రభూ! ఆ బ్రాహ్మణబాలుఁడే యైయుండ వలయును. అతఁడు వీరవర్మమీఁద, భల్లాతవర్మమీఁదఁ బగ పట్టెను. ఆయనకుఁ దమమీఁదఁ బగ యేమున్నది? ఆయనకు న్యాయము జరుగలే దని కోపముతో నిట్లు చేయుచుండె' ననెను. అపుడు చక్రవర్తి మఱల ని ట్లనెను. 'ఓయీ! అతఁడు మంచి సాహసుఁడే కాఁడు; సైనికశిక్షణ పొందినవాఁడుకూడను. గొప్ప సేనానాయకున కుండవలసిన లక్షణములు కలవాఁడు. యుద్ధనీతివిశారదుఁడు. అటువంటివాఁడు మన సేనానాయకులలో నెవ్వఁడును గనిపించఁడు. అతని రహస్యచారభావము నా కాశ్చర్యము గొలుపుచున్నది. మనసైనికులు పోయి ముట్టడించువఱకు స్థానాకోడూరులోఁ బురుగు లేకుండ జేసెను. అరక్షితమైయున్న నిరాశాపట్టణము నాక్రమించెను. వార్తాహరులనుఁ జేరనీయఁడు. అతని వయ స్సెంత యని చెప్పితివి?' అనఁగా సేవకుఁడు పదునెనిమిదేండ్లకన్న నెక్కువ యుండ వని చెప్పెను. చక్రవర్తి వానిమీఁది కెవరిని బంపుద మనెను. సేవకుఁడు 'స్వామీ! వీరవర్మగారిని బంపినచో బాగుగా నుండును. ఇతఁ డొనాఁటికుఱ్ఱవాఁ డని వీరవర్మగారితోఁ జెప్పినచో వానిని గెలువవలయు నను పట్టుదలకూడ వీరి కుండును. తరువాతఁ బ్రభువుల చిత్త' మనెను. చక్రవర్తి వాఁడు చెప్పినమాట బాగుగా నున్న దనుకొనెను. వీరవర్మకుఁ గబురంపెను. వీరవర్మ వచ్చెను. చక్రవర్తి నవ్వి, 'విన్నావయ్యా సేనాపతీ! ఏడాదిక్రింద నొక బ్రాహ్మణ బాలుఁడు భల్లాతవర్మమీఁద నభియోగము తేఁగా, మన సేనాపతులలో నెవరో యొకఁడు వానిమొగముమీఁదఁ గొర

డాతోఁ గొట్టెనఁట ! అతని కెవ్వరును మాదర్శనము చేయించ లేదఁట! ఇప్పు డతఁడు శాతవాహనరాష్ట్రమునఁ జిన్నచిన్నదుర్గము లన్నియు స్వాధీనము చేసికొనుచుండె' ననెను. వీరవర్మకు సర్వము జ్ఞాపకము వచ్చెను. ఆకొట్టినది తానే యని చెప్పలేదు. అంతఁ జక్రవర్తి మఱల నిట్లనెను. 'నాల్గువేలసైన్యముతో ని న్నతనిమీఁదికిఁ బంపవలయు ననుకొనుచున్నాము. అచ్చటికిఁ బోయి వెలియుద్ధము చేయవలయునో, దుర్గమునే ముట్టడింప వలయునో నీవే సర్దుకొనవలయును. మే మిప్పు డాచిన్నవిషయ మునుగూర్చి యూహించుటకు వీలులేదు. నేఁడే ప్రయాణమై పొ' మ్మనెను.

ఎనిమిదివందలమంది యాశ్వికులు, నాల్గువేల పదాతులు వెంట రా వీరవర్మ శాతవాహనరాష్ట్రమునకుఁ బయనము కట్టెను. పదాతిసైన్యము వెనుక వచ్చుచుండెను. ఆశ్వికులు ముందుఁ బోయిరి. పదాతిసైన్యముకంటె నాశ్వికసైన్యము శాతవాహన రాష్ట్రపరిసరములు నాల్గుదినములు ముందుగాఁ జేరెను.

అం దొకచోట వీరవర్మ యాశ్వికదళము నుంచి పదాతి సైన్యముకొఱ కెదురు చూచుచు, మయూరునిసైన్య మెచ్చోట నుండెనో కనుగొనుటకు గూఢచారులను బంపించెను. గూఢ చారులు రెండుదినములలోననే వచ్చిరి. మయూరుఁ డిచ్చట నున్నాఁ డని చెప్పుటకు వీలు లేదు. స్థానాకోడూరులో లేఁడు. నిరాశాగ్రామమున లేఁడు. నిరాశకోట కోటగా లేదు. అచ్చట దుర్గద్వారములే తీసివేయఁబడెను. పల్లవనగరములన్నియుఁ జూచి వచ్చిరి. ఏనగరముననుబూర్వపురక్షణ లేదు. అన్ని నగరముల

యొక్క ప్రాకారపుగోడలు నిర్మూలింపఁబడియుండెను. వీరవర్మ కిది యాశ్చర్యము వేసెను. వచ్చిన గూఢచారులు మయూరుని సైన్య మిరువదివేలుండెనని యొకఁడు, పదివే లని యొకఁడు, పదునేనువే లని యొకఁడు చెప్పిరి. వీరవర్మ యాశ్చర్యపోయెను. తాను గొరడాతోఁ గొట్టిన కుఱ్ఱవాఁడా వీఁడు! చక్రవర్తి తన్నే యీపనిమీఁదఁ బంపించెను, ఇంత లెక్కగానున్న యతని సైన్య మెంతతక్కువగా నున్నను నాల్గువే లుండకపోదుగదా! అట్టి సేనాధిపతిశిక్షణ యెంత గట్టిదో! తా నిప్పుడేమి చేయవలయును? శత్రుసైన్య మీచోటనున్నదని తెలిసినచోఁ దానుపోయి యుద్ధము చేయవచ్చును. ఈ కోట ముట్టడింపవలయు నన్నచో ముట్టడించ వచ్చును. చివరకు వీరవర్మ యిట్లనుకొనెను. తాను వైజ యంతికిఁ బోవును. అచటినుండి పల్లవేంద్రనగరములను మఱలఁ గట్టుదిట్టములోనికిఁ దెచ్చును. పల్లవేంద్రనగరములకుఁ బోయి చూచెను. ఆనగరముల ప్రాకారములు మఱల బాగుచేయించి కోటతలుపులు వేయించి ప్రతినగరమున నాల్గువందలమంది సైనికుల నుంచెను. చివరకు వీరవర్మకు మిగిలినది తన యెనిమిది వందలమంది యాశ్వికులే. ఈలోపుగాఁ జెల్లాచెదరైన పల్లవ సైనికులు మూఁడువేలమంది వీరవర్మను వచ్చి యాశ్రయించిరి. ఈ మూఁడువేలసైన్యమును, నెనిమిదివందల యాశ్వికులును వెంట రా వీరవర్మ వైజయంతీపురాభిముఖుఁ డయ్యెను.

వైజయంతీపురము మహానగరము. అర్ధయోజనముమేఱ పొడుగు, నర్ధయోజనముమేఱ వెడల్పుగల పటణము. ఈపట్టణ మొకపర్వతముక్రిందిభాగమునఁ బ్రాగ్దిశయం దున్నది. కోట

కొండమీఁద నుండెను. దుర్గమును బట్టుకొనుట సాధ్యమైన పని కాదు. తన నాల్గువేల సైన్యము వైజయంతిలోఁ జేర్చినచో మయూరునియాటలు సాగవు.

వీరవర్మకు మఱియొక పట్టుదల హెచ్చెను. మయూరు నకుఁ దా నెదురుపడవలయును. అప్పుడు మయూరు నేమి చేయ వలయునో చూడవలయును. చక్రవర్తి తనతో నన్నమాటలు తనకుఁ గత్తిపెట్టి పొడిచిన ట్లుండెను. వీఁ డెవఁడో యూరుపేరు లేనిబాలుఁడు. తాను గొప్పసేనాపతి. చక్రవర్తివలనఁ దన కింతటి పరాభవమా? తీరా, తాను సైన్యము నడుపుకొని వచ్చినచో, తా నెదురుపడలేని పిఱికిపంద - వీఁ డొకమహావీరుఁడు. చక్ర వర్తికిఁ దనప్రతిభ రుజువు చేయును. అప్పుడే తెలియును జక్రవర్తికి. ఎందుకుఁ గొఱగాని యొకబాలుని బురస్కరించు కొని సేనాపతి నధిక్షేపించుట న్యాయము కా దని.

వీరవర్మ తన సైన్యముతో వైజయంతికిఁ బోయెను. వైజయంతికిఁ బోవునప్పటికి నతనికిఁ దెలిసెను. వైజయంతీ దుర్గము మయూరుని యధీనములో నుండెను. వీరవర్మ దుర్గ మును ముట్టడి వేయవలసివచ్చెను. లోపల నెంత సైన్య మున్నదో వీరవర్మకుఁ దెలియలేదు. పట్టణవాసు లెనిమిదివేల సైన్య మున్న దని చెప్పుచుండిరి. వీరేశ్వరుఁ డే మయ్యెను? వైజయంతి దుర్గాధిపతి యే మయ్యెను? పల్లవసైన్యమే యించుమించుగా మూఁడువే లుండవలయును. అది యే మయ్యెను? పట్టణప్రజల నెవ్వరి నడిగినను 'నా సైన్య మే మైనదో మాకుఁ దెలియదు. ఒక దినమునఁ బెద్ద సైన్యముతో మయూరుఁడు వచ్చెను. వచ్చిన

వెంటనే కోటతలుపులు తెఱువఁబడెను. ఈసైన్యమంతయు నిరాటంకముగా లోనికిఁ బోయెను. లోపలనున్న కొలఁదిమంది పల్లవసైన్యమును వీరు హతమార్చి' రని చెప్పిరి. తక్కిన సైన్య మే మయ్యె నని యడుగఁగా దుర్గాధిపతియు, వీరేశ్వరుఁడును మయూరునిమీఁదికి యుద్ధమునకుఁ దీసికొనిపోయి రని చెప్పిరి. ఎచ్చట? ఎచ్చటికో తెలియదు. వైజయంతిలో మయూరుఁ డున్నాఁడా? ఉన్నాఁడో, లేఁడో యెవ్వరికిని దెలియదు. వీరవర్మ కిది యంతయు నొకయింద్రజాలముగాఁ గనిపించెను.

వైజయంతీదుర్గమును వీరవర్మ ముట్టడించెను. మఱు నాఁడు ముట్టడి ప్రారంభము చేయును. ఆరాత్రి కొలఁదిమంది సైనికులు జాగ్రత్తగా నుండిరి. తక్కినవారందఱు నిద్రపోవు చుండిరి. నాఁటిరాత్రి మేఘములుపట్టి ప్రళయవర్షము కురియ నారంభించెను. ఈసైనికులందఱు పోయి పట్టణములో గృహ స్థుల యిండ్లలోఁ దల దాఁచుకొనఁబోయిరి. అశ్వికులు తమ గుఱ్ఱములను గృహస్థులయొక్క పశువుల సావడులలోఁ గట్టి వేసి, తాము వీలైనచోట్ల దుప్పటులు కప్పికొని పరుండిరి. తెల్లవారులుఁ బ్రళయమైన గాలులు, ప్రళయమైన వాన.

తెల్లవారి చూచుసరికి నేసావడిలోఁ గట్టివేసిన గుఱ్ఱ ములును గనుపించ లేదు. కొందఱాశ్వికులు తమగుఱ్ఱమువద్దనే పరుండిరి. వారిశరీరములు తలలు తలలుగా, మొండెములు మొండెములుగా నఱుకఁబడియుండెను. ఒక్కసైనికుని యాయు ధము వానియొద్ద లేదు. కత్తులు, డాళ్ళు నన్నియు నపహరింపఁ బడెను. ప్రొద్దుటనే వాన వెలిసినది. ఈమూఁడువేలసైన్యము

మఱల సమకూడినది. ఆరాత్రి కోట ముట్టడి వేయుటకు వలసిన సాధనములు, నిచ్చెనలు, గొలుసులు, త్రాళ్ళు మొదలయిన సామగ్రియంతయు నొకచోట నుంచి, దానిచుట్టును వందమంది సైనికులను గా పుంచిరి. వారిలో నొక్కఁడును గనిపించలేదు. అనేకపల్లవసైనికుల నఱుకఁబడిన శరీరములు గ్రామములో నెచ్చటఁబడిన నచ్చట, సైన్యము తీర్చినబయలున నెచ్చటఁబడిన నచ్చటఁ గనిపించెను.

వీరవర్మ కేమి చేయవలయునో తోఁచలేదు. అతఁ డూరకే నిప్పులు గ్రక్కుచుండెను. ఇంతలో వేయిమంది సైన్యము యుద్ధసన్నద్ధమై కొండమీఁది దుర్గద్వారము తెఱచుకొని వచ్చి వీరిమీఁదఁ బడిరి. ఈమూఁడువేల సైన్యములయొక్క హాహారవములు మింటి కెగసెను. చాలమంది సంహరింపఁబడిరి. మిగిలిన వారిని బందీలుగాఁ బట్టుకొనిరి. వీరవర్మ బందీ చేయఁబడెను. వీరవర్మ తనకు సాధ్యమైనంతవఱకు యుద్ధము చేసెను. చాల మంది శత్రువులను జంపెను. కా ని, చివరి కొ క సేనానాయకుఁడు తనచేతిలోనున్న చివర నుచ్చువేసిన పగ్గమును వీరవర్మ మెడమీఁదికి విసరి క్రిందికి లాగెను. దానితో వీరవర్మ గుఱ్ఱము మీఁదినుండి క్రిందఁ బడిపోయెను.

## నవమాధ్యాయము

వైజయంతీదుర్గమునఁ జెఱసాలలో వీరవర్మ బంధింపఁబడి యుండెను. అతనికి గాయములకు వైద్యుఁడు చికిత్స చేయు చుండెను. ఆసమయమునఁ బదిపత్రములు చేతఁ బూని మయూరుఁడు లోనికి వచ్చెను. ఈమయూరునకును, వీరవర్మ యేడాది క్రిందఁ గాంచీనగరములోఁ జూచిన మయూరునకును నేమియు భేదము లేదు. వట్టి ధోవతి, పైన నొక సేలువ, తలపాగ, మెడలో జందెము కనఁబడుచుండెను. మొగమున విభూతి రేఖలును, నొసటఁ గుంకుమబొట్టును, ఒక్కటియే భేదము. అప్పటి మయూరశర్మ పసిమిచాయఁగలిగి మిసమిసలాడు చుండెను. నాఁటి యతనిశరీరము సౌకుమార్యము వెడలఁ గ్రక్కుచుండెను. ఇప్పటి యీమయూరశర్మ శరీరము కొంచెము నల్లబడియుండెను. మానిసి కొంచెము పలుచఁబడెను. కాని, యొడలు నాఁటికంటె కఠినీకృతములైన కండరములు కల దయ్యెను. మయూరుఁ డిట్లనెను. 'ఈరాజ్యములో న్యాయమే లేదా? ఒకదళవాయి చేసిన దౌర్మార్గ్యమునకు శిక్షయే లేదా? న్యాయము పాలించనిచో, న్యాయము పాలింతు మన్న వేషము

వేయుట యెందులకు ? న్యాయపుచట్టములు, పరిషత్తులు, మొదలైన కితవవేషము లెందుకు ? అధికారి తనతో సమానుఁడైన యధికారితోనో, తనకంటె నధికునితోనో మాటాడును గాని తనకంటెఁ దక్కువవారితో మాటాడరాదా ? ధనము లేని, యధికారములేని మనుష్యుఁడు మనుష్యుఁడే కాఁడా' యని యనెను. వీరవర్మ కీమాట లొక్కొక్కటియు జ్ఞాపకము వచ్చెను. 'ఓహో ! ఈమయూరుఁ డెంత సాహసియో, యెంత రాజకీయవేత్తయో, యెంత చమూచారణదక్షుఁడో యంత నిందానిపుణుఁడు. అంత పగ దీర్చుకొనెడువాఁడు. వీరవర్మ మనస్సులోఁ జమత్కారములైన యూహలు జనించెను. 'ఇతనికి నావలన జరిగిన యపకారము కొద్దిది. పల్లవరాజు వలన నపకారమే జరుగలేదు. కాని, జరిగినట్లే యయ్యెను. ఇతనికి మహాపకారము చేసినవాఁడు భల్లాతవర్మ. ఆపల్లవరాజు మీఁది పగ యిట్లు తీర్చుకొనుచున్నాఁడు. నామీఁదఁ బగ తీర్చుకొనుట కారంభించినాఁడు. భల్లాతవర్మమీఁదఁ బగ యెట్లు తీర్చుకొనునో ? వీఁడెవఁడో ప్రళయరుద్రుఁడు. కాని నామనసులో నొక సందేహము తెగలేదు. ఈ బాలుఁడు మహాసేనాని యెట్లయ్యెను ? ఇతనిని జూచినచో వీఁడు గుఱ్ఱముమీఁద నెక్కగలఁడా ? బల్లెము విసరఁగలఁడా? కత్తి పట్టఁగలఁడా యనిపించుచుండె' ననుకొని వీరవర్మ మయూరునితో నిట్లనెను. 'బ్రాహ్మణబాలుఁడా ! నీ కపకారము చేసినది భల్లాతవర్మ. నాఁటికి నీ వింతవాఁడ వవుదువని నాకుఁ దెలియదు. నీకే తెలియదేమో' యనెను. మయూరుఁడు 'ఓయీ ! సేనాపతీ ! నీకుఁ దెలియదు. కాని, నాకుఁ

దెలియును. నే నెంతవాఁడ నైనాను. ఇం కెంతవాఁడ నగుదునో నీ కేమి తెలియును? వట్టి కత్తిపుచ్చుకొనుటయే మహాప్రయోజ కత్వ మనుకొను నీవంటి దేహవాదుల కింతకంటె నెక్కువ యేమి తెలియగల' దనెను. వీరవర్మ 'యట్లే కానిమ్ము. నీకుటుంబ మును భల్లాతవర్మ నాశనము చేసెను. నీకుఁ దెలిసినది నీకుటుం బముసంగతియే. ఒక్కభల్లాతవర్మసంగతియే. అతఁడే యెన్ని కుటుంబములనో నాశనము చేసియుండును. ఆయుద్ధసమయ మున భల్లాతవర్మవంటివా రిం కెందరిచేతనో, మఱియిం కెన్ని కుటుంబములో నీకుటుంబమువలె నైయుండును. నీ వొక్కఁ డవు సూడు దీర్తువు. తక్కినకుటుంబములమాట యేమి' యనెను. మయూరవర్మ బదులు చెప్పెను. 'ఓయీ! పరమ శివుఁడు నాచేత నామహాదుష్కార్యమున కంతకును బ్రతిక్రియ చేయించుచుండెను. భగవంతుని శిక్షాపద్ధతి చాల విచిత్ర మైనది. రాజులు చేయు నన్యాయములు తదధికారులద్వారా జరుగును. ఆయధికారు లందులోఁ దమదుర్బుద్ధిఁ జొనిపి రా జుద్దే శించిన యన్యాయమునకుఁ బదిరెట్లు జరుపుదురు. ఈయధికారు లను భగవంతుఁడు ముందు శిక్షించును. ఆశిక్ష యొక్కపద్ధతిగా నుండునా? మూఢలోకమునకుఁ దెలియదుగాని, భార్య చని పోవును. చేతి కెదిగిన కొడుకు మరణించును. దీర్ఘవ్యాధి వచ్చును. ఉద్యోగమే పోవును. భగవంతుని శిక్షాపద్ధతి పలు రకములుగా నుండును. ఈదుష్టాధికారులలోఁ గొందఱు తప్పించు కొన్నట్లు కనిపింతురు. వారికిని శిక్ష తప్పదు. ఇంకరాజులు చేసిన యన్యాయమునకు శిక్ష దీర్ఘకాలముమీఁద జరుగును.

నేఁడు కాకున్న ఱేపు వారిరాజ్యము నశించును. వారిసార్వ భౌమత్వము నేతిబీఱకాయవంటి దగును.'

అంత మయూరుఁడు చేతిలోని పదిపత్రములను వీరవర్మముందుఁ బెట్టి వానిమీఁద వీరవర్మ చేవ్రా లుంచు మనెను. వీరవర్మ యాపత్రములలో నొకటి చదివెను. 'నిరాశాదుర్గనైయోగికునకు, సేనాపతియు సంచారాంతకుఁడు నయిన వీరవర్మ యాజ్ఞాపించునది: మేము మూఁడువందలమంది సైనికులను, బంపించుచున్నాము. వీరిని మీదుర్గములో నుంచుకొని, దుర్గములోనున్న నాల్గువందల పల్లవసైన్యములో మూఁడు వందలమందిని వెంటనే వైజయంతీదుర్గమునకుఁ బంపింపవలయును. ఇది మహారాజకార్యము. వెంటనే చేయవలయును.' వీరవర్మ తక్కిన కాగితము లన్నియుఁ జూచెను. తామ్రప్రస్థానము, కడకము, ధానాకడము, దశనపురము, పాలకాడము, ప్రతిష్ఠానము, పల్లవపురము, ధేనుకుందూరు, ఆదేయహారము, నిరాశము— ఈపదిగ్రామములు కోటప్రాకారములు బాగు చేయించి వీరవర్మ ప్రతిస్థలమునందును నాలుగువందలసైన్యముల చొప్పున నుంచి వచ్చెను. ఆపదిదుర్గముల నైయోగికులకు నిట్లే వ్రాయఁబడెను. మయూరుఁడు వీరవర్మచేతికి గంట మిచ్చెను. వీరవర్మ యాలోచించు చుండెను. మయూరుఁ డి ట్లనెను. 'సేనాపతీ! నీవు నామొగమునఁ గొరడాతోఁ గొట్టితివి. ఇదిగో నీ మొగమున నేను గొరడాతోఁ గొట్టుచున్నాను. ఈపనియే నిన్ను గొరడాతోఁ గొట్టుట. భగవంతునిశిక్ష న్యాయముగాఁ దీసికొనుము. న్యాయమైనశిక్ష న్యాయముగాఁ దీసికొన్నచో శిక్ష

కొద్దిలోఁ దీరిపోవును. ఎలయించినచో దానికి వడ్డి పెరుగును. ఈ పదినగరములను నీప్రయత్నము లేకుండ నిముసములోఁ బట్టుకొనగలను. నీకు వివేక మున్నచో మొన్నరాత్రి నీ సేన యంతయు న ట్లగుటకు హేతు వేమో విచారించుకొనుము. వై జయంతీపురమునందలి ప్రతిగృహయజమానియు నాసైని కుఁడు. ఎవరో వచ్చి నీగుఱ్ఱములను దొంగిలించలేదు. నీబంటుల యాయుధము లపహరింపలేదు. గృహయజమానుఁడు, వారి పాలికాపులు చేసిన పనియే యిది. ఇట్లే శాతవాహనరాష్ట్రి మంతయు నున్నది. మయూరుఁడు బోడిబాపఁడు కాఁడు. నీవు న్యాయముగాఁ జేవ్రా ళ్లించు మనెను. వీరవర్మకు మయూరుఁడు చెప్పిన విషయములలోని యాథార్థ్యము తెలిసెను. ఈమాట లకును, నాపదిదుర్గములు మయూరునకు వశము చేయుటకును సంబంధము తెలియలేదు. వీరవర్మ యాలోచించుచుండెను. మయూ రుఁడు నవ్వి యి ట్లనెను. 'ఓయీ ! నీయాలోచన నాకుఁ దెలి యును. అచటిదుర్గములలోని సైన్యము లెట్లు జయింపఁబడు నని యాలోచించుచున్నావు. నీ నాల్గు వేల సైనికుల యాయు ధములు, ముట్టడిఁజేయు సాధనములు నాయానగరముల కిది వఱకే చేరెను. నగరదుర్గములలోని నీపల్లవసైన్యము తిండిలేక మలమల మాడిపోవును. కోటలోని సైన్యము బయటికి రాదు. లోనికి వఁ్లగింజ పోదు. దుర్గములలోని చెఱువులలో, బావులలో విషము కలిపించెదను. వృథాగా మూఁడు వేలమందిని జంపుకొనకుము. మఱలఁ జక్రవర్తియెదుటఁ దల యెత్తికొనలేవు. నిరా యుధమైన యీమూఁడువేల సైన్యమును దీసికొని చక్రవర్తి

వద్దకుఁ బోయి, 'ప్రభూ! నాచేతఁ గాలేదని చెప్పుకొనవచ్చు' ననెను. వీరవర్మమనస్సులో మయూరశర్మ యొక ప్రచండుఁడైన మహాసేనాధిపతిగా నాడఁజొచ్చెను. అతని మనస్సు దిగ్భ్రాంతిఁ బొందెను. వీఁ డెచ్చటివాఁడు? వీనిముందు బుధ్యం కరుఁడైనను జాలఁడు. ఓహో! శాతవాహనరాష్ట్రప్రజలు! ఏమి వీరియైకమత్యము! ఇంత స్వాతంత్ర్యదీక్షాపరమైన దేశమును బల్లవచక్రవర్తి నిలుపుకొనలేఁ' డని యాలోచించి, యా తాఁటియాకులమీఁదఁ జేవ్రాలు జేసెను.

మయూరశర్మ వెడలిపోయెను. తరువాత నాలుగు దినములకు మూఁడువందలు మూఁడువందలుగా వైజయంతీ పురమునకుఁ బల్లవసైన్యములు రాఁ బ్రారంభించెను. ఒకమూఁడు వందలు ప్రొద్దుట వచ్చును. ఒకమూఁడువందలు సాయంతనము వచ్చును. ఒకమూఁడువందలు మఱునాటిప్రొద్దున వచ్చును. ఇంకొక మూఁడువందలు మధ్యాహ్నమున వచ్చును. కోటలో నొక పెద్దసైనికుల విడిశాల యుండెను. మూఁడువందలమందియు నాశాలలోనికిఁ బోవుదురు. ఆయుధములన్నియు నచ్చట వదలి పెట్టి స్నానపానాదులకొఱకు విడిగా మఱియొకచోటికిఁ బోవుదురు. స్నానపానాదులైనతరువాత, మఱల మొదటిచోటికి వచ్చువఱకు వారియాయుధములు, వారిదుస్తు లచ్చట నుండవు. ఈమూఁడువందలమందియు బందీలు చేయఁబడుదురు. వెంటనే వారువందమంది యాయుధపాణులైన శాతవాహనరాష్ట్ర సైన్యము రక్షకత్వముక్రింద మఱియెచ్చటికో తీసికొనిపోఁ బడుదురు.

శాతవాహనరాష్ట్రి మంతయు మయూరుని యధీన మయ్యెను. తక్కిన మహానగరములుకూడ మయూరుఁడు చిత్ర విచిత్రములుగా సాధించెను. పల్లవరాజు మొదట శాతవాహన రాష్ట్రిమును గెలిచినప్పుడు గ్రామములయందలి క్రిందియధికారుల ననఁగా నధికృతులను, నాయుక్తకులను, బల్లవులను నియమించ లేదు. దుర్గాధిపతులవంటి నైయోగికులనుమాత్రమే పల్లవుల నేర్పఱచెను. మహానగరాధిపతులైన రాజవల్లభులు పల్లవులు. అందఱికంటెఁ బైయధికారిపేరు సంచారాంతకుఁడు. ఈసంచా రాంతకుఁడు పదిరాష్ట్రిములమీఁద నొక్కఁడుండును. దక్షిణా పథమున నాదేయరాష్ట్రిము, వెంగోరాష్ట్రిము, మంద్రరాష్ట్రిము, శాతవాహనరాష్ట్రిము, కర్ణరాష్ట్రిము మొదలైన యనేకరాష్ట్రి ములు కలవు. ఈసర్వరాష్ట్రిములమీఁద నొకసంచారాంతకుఁ డుండును. ఏదైనను విప్లవము జరిగినప్పుడు పల్లవచక్రవర్తి రాష్ట్రాధిపతియైనవానికే సంచారాంతకుని యధికారము లిచ్చును.

అధికృతులు, నాయుక్తకులు, శాతవాహనరాష్ట్రీయులే. వారందఱు మయూరుని యధీనులైరి. అందుచేత మయూరుని కార్యము మిక్కిలి సులభము.

వైజయంతీనగరము పడమటి కనుమలలో నున్నది. వైజయంతికి మఱియొకపేరు వనవాసి. వైజయంతికిఁ జుట్టును నున్న సర్వదేశము మహాపర్వతమయము. మహారణ్యామయము. మయూరుఁడాదుర్గమును మిక్కిలి బలిష్ఠము చేసెను. శత్రువుల కభేద్యముగా నిర్మించెను. పూర్వపు రాజపథము లన్నియు నిర్మూలము చేసెను. ఇప్పుడు మఱలఁ బల్లవసైన్యము వైజ

యంతిమీఁదికి దండెత్తి వచ్చినచో వైజయంతిని జేరనేరాదు. వైజయంతికి యోజనము, నర్ధయోజనము దూరములయందు వంద చిన్నచిన్న దుర్గము లేర్పఱచెను. కొన్నిదుర్గములే కావు. వెనుకభాగమున నెత్తైనపర్వతభాగముండును. ముందు గుండ్రముగాఁ గోటగోడవలెఁ బెద్దఱాళ్ళేర్పఱచియుండును. ఒక్కొక్కచోటఁ బదిమంది సైనికులకన్న నెక్కువమంది యుండరు. వారు పైనుండి మహాశిలలు దొర్లింతురు. మయూరుఁడు క్రొత్త క్రొత్త మారణాయుధములు కనిపెట్టెను. ఈచిన్నచిన్న దుర్గములమీఁద రక్షకులైనవారు భిల్లసైన్యము. వైజయంతీపరిసరారణ్యనివాసులైన భిల్లులు గుఱితప్పని వింటివాండ్రు. నిముసమునకుఁ బదియమ్ములు దూయు లాఘవముకల విలుకాండ్రు. మయూరుఁ డింతతో నూరకుండలేదు. శాతవాహనరాష్ట్రమునకు నీశాన్యదిశగా శ్రీశైల ముండెను. శ్రీశైలపర్వతములు దాఁటినచో నిక్ష్వాకురాజ్యము. ఇదియే విజయపురరాష్ట్రము. ఈ విజయపురీక్ష్వాకులు బాహుబలశాంతిమూలునితర్వాత బాహుబలము శాంతించినవారై, పల్లవరాజులకు జోహారులు చేయుచుండిరి. తరువాతఁ దూర్పుదెసఁ గర్మరాష్ట్రమును, పోగరాష్ట్రమును, వెంగోరాష్ట్రమును, మండ్రరాష్ట్రమును కలవు. దక్షిణమున హిరణ్యరాష్ట్రమును, బల్లవచక్రవర్తి యేలుబడిక్రిందనున్న దేశమును గలవు. పడమటిదిక్కున మహాపర్వతపంక్తి. ఉత్తర దిశయందుఁ గొంతమేరఁ దుంగభద్రానదియుఁ గృష్ణానదియుఁ గలవు. ఆనదులు దాఁటినచోఁ గర్ణరాష్ట్రము కలదు. హిరణ్యరాష్ట్రము పోగ, వెంగోరాష్ట్రములకు, శాతవాహన

రాష్ట్రమునకుఁ దూర్పుదెస నడ్డముగా నున్నది. ఈ రాష్ట్రము లన్నియు బల్లవచక్రవర్తియధికారము నంగీకరించెను. కర్మ రాష్ట్రమున కుత్తరముగాఁ గొలివిరాష్ట్ర ముండెను. ఈరాష్ట్రము నకు వేంగీనగరము రాజధాని. ఇది సాలంకాయనులదేశము. దానిప్రక్కనేయున్న కర్మరాష్ట్రమునందు బృహత్పలాయను లుండిరి. వెంగోరాష్ట్రము మున్నేరు, పినాకినీనదుల నడిమ దేశము. దీనియందు దానందులు చెలరేఁగిరి. ఈయానందులును, బృహత్పలాయనులును బల్లవచక్రవర్తి కెదురు తిరిగిరి. కొలివి రాష్ట్రాధిపతులైన సాలంకాయనులు పల్లవులయాజ్ఞ యెప్పుడో తిరస్కరించి స్వతంత్రు లైరి. పల్లవచక్రవర్తి చేయునది లేక వారిస్వాతంత్ర్య మంగీకరించెను. అంగీకరించుటయే కాదు. వారియాహ్వానముమీఁద సముద్రగుప్తుని దండయాత్ర కెదురు పోవుటకుఁ దాను సాయము పోయెను.

మయూరుని సైన్యములు పర్వతప్రదేశమునందు మిక్కిలి దిట్టరులు. మయూరుఁడు తనభిల్లసైన్యములను శ్రీశైల పర్వతమునం దంతయు నింపెను. ఉత్తరమునుండి భయమే లేదు. కర్మరాష్ట్రమునకు సముద్రగుప్తుని దండయాత్రాభయ ముండెను. వారు తనవైపునకు మఱలరు. తుంగభద్రానది యున్నంతమేరఁ దుంగభద్ర మహాశిలా ప్రదేశములయందుఁ బ్రవహించు చుండెను. అది సైన్యములు నడిపించుటకుఁ దగిన స్థలము కాదు. కృష్ణానది వచ్చి శ్రీశైలపర్వతములకుఁ గొంత యెగువభాగ మునఁ దుంగభద్రతోఁ గలియును. హగరీనది తుంగభద్రలోఁ

గలియుచోటునుండి తుంగభద్ర కృష్ణానదిలోఁ గలియుచోటు వఱకు మయూరుఁడు కట్టుదిట్టము చేయవలసివచ్చెను.

శాతవాహనరాష్ట్రమే రెండుభాగములు చేయవచ్చును. హగరీతుంగభద్రల నడుమ నున్న భాగ మొకటి. హగరీనది వెలుపల కృష్ణాపినాకినీనదుల నడుమ నున్న దేశ మొకటి. ఇదివఱకు సామాన్యముగాఁ జేపలను బట్టు వృత్తిగల కులముల నన్నింటిని మయూరుఁడు సమకూర్చి వారిని జలసైన్యమును జేసెను. వారు తుంగభద్రాహగరీనదులమీఁద మహారక్షణముఁ జేయుచుండిరి. వారినావలన్నియు మహాయుధములతో నిండియుండెను. వారంద ఱాయుధప్రయోగనిపుణులు. పడవలను మహాప్రవాహమున కెదురు నడిపించఁగలవారు.

తూర్పుననున్న హిరణ్యరాష్ట్రమునుండి మయూరునకు భయమే లేదు. వారు వట్టి పెంబేదలు. వారివెనుకనే యానందు లుండిరి. ఆనందులు పల్లవుల కెదురు తిరిగిరి. పడమట శాతవాహనరాష్ట్రమును, తూర్పున వెంగోరాష్ట్రమును బల్లవుల శత్రువులు కాఁగా నడుమనున్న హిరణ్యరాష్ట్రము మఱియు బలహీన మైనది. ఏమి చేయఁగలదు ? ఈరీతిగా మయూరునకుఁ దాను రక్షింపఁదగినది యొక్క యీశాన్యదిశయే కనిపించెను. భిల్లసైన్యమును శ్రీశైలపర్వతములయందు నెలకొల్పెను. తక్కినదిక్కులయందుఁ దగినంతరక్షణ యేర్పఱచెను. ఇంకఁ దా నున్నాఁడు, దక్షిణదిశ యున్నది. దక్షిణదిశ యంతయుఁ బల్లవరాష్ట్రము.

శాతవాహనరాష్ట్రమునఁ బదునాలేండ్లబాలుఁడు మొదలుఱువదియేండ్లవృద్ధునివఱకు సైనికులే యైరి. మయూరుఁడు తాను బోని గ్రామము లేదు. అందఱితోఁ దానే మాటాడును. అన్నికుటుంబముల యోగక్షేమములు విచారించును. మహా సేనాధిపతి వచ్చుచున్నాఁడని వృద్ధులు లేచి నిలుచుందురు. 'తాతా! కుఱ్ఱవాఁడను నేను రాఁగా లేవవలెనా?' యని మయూరుఁడు గౌరవము నెఱపును. మయూరుఁ డొకయింటికిఁ బోవును. వాకిటఁ బసివాఁ డేడ్చుచుండును. మయూరుఁ డాపసివానిని జంకకుఁ దీసికొని, యుత్తరీయముతో ముక్కు తుడిచి, యోదార్చుచుండును. ఇంతలోఁ దల్లి వచ్చి సిగ్గుతో, భయముతో, నవ్వుతో నాయనచేతులు తాఁకకుండఁ బసివానిని దీసికొనును. ఆమె యావార్తఁ బదిమందితోఁ జెప్పును. మయూరుని గొందఱు మహారా జందురు. కొందఱు సేనాపతి యందురు. కొందఱు మయూరశర్మ యనియే యందురు. శాతవాహన రాష్ట్రగతసర్వగ్రామఘటికలు, సర్వభోగములు బసిబిడ్డబాలాది మయూరు నెఱుఁగుదురు. మయూఱుని బ్రేమింతురు. మయూరుఁడు తమస్వాతంత్ర్యదాత యందురు. మయూరుఁడు పరమశివుని యవతార మందురు. మయూరుఁడు చేసిన దే మనఁగా మఱల వచ్చి యేయితరచక్రవర్తియు శాతవాహన రాష్ట్రమును స్వాధీనము చేసికొనలేఁడు. ఏగ్రామమున కాగ్రామమే దుర్గము. స్త్రీలుకూడ సైనికులే. ప్రతిగ్రామమునకును రక్షణోపాయములు దెలియును. ప్రతిగ్రామమునందు రహస్యచారు లుందురు. శత్రుసైన్యములు వచ్చుచున్నచోఁ బ్రతిగ్రామమునకు రెండు

దినములకుముందే తెలియును. ఆవచ్చు సైన్యముయొక్క బలమునుబట్టి వలసినచో నందఱు గ్రామమే వదలి పోవుదురు. శత్రుసైన్యముల కాహారపదార్థముల నందనీయరు. ప్రతి గృహమునందు నాయుధములు కలవు. గ్రామరక్షణ చెడినచో గృహరక్షణఁ జేసికొనగలరు. ఏశత్రువు నెట్లు సాధించవల యును? బహుశత్రువుల నెట్టు లెదుర్కొన వలయును? సర్వసైనికశిక్షణయు దేశమునందుఁ బ్రతివ్యక్తికి నేర్పఁ బడెను. నాల్గునెలలలో మయూరుఁ డింత మహాకార్యమును జేసెను. శాతవాహనరాష్ట్రము భద్రాతిభద్రముగా నుండెను. పల్లవచక్రవర్తి మహాసైన్యములఁ బంపినచో నాసైన్యము లెవ్వరితో యుద్ధము చేయును? మయూరునియొక్క మహా సైన్యము వారి నెప్పుడు నెదిరించదు. ఆసైన్యము చిన్నచిన్న ముక్కలుఁగా జీలి యూళ్ళమీఁదఁ బడవలయును. పడినచో నేముక్క కాముక్క యక్కడనే ముక్కలుముక్క లగును. ఇది మయూరుని మహావ్యూహము. పర్వతోపరిభాగముల మహా రణ్యముల నున్న మయూరుని మూలసైన్యము సర్వదా యీ గ్రామములకు సహాయము చేయుచుండును. ఆసైన్యము మెఱ పులవలె వచ్చును, మెఱపులవలెఁ బోవును.

## దశమాధ్యాయము

ఈనాల్గునెలలు వీరవర్మ చెఱసాలలోనే యుండెను. అతనికి సర్వమైన సౌకర్యములు జరుపఁబడుచుండెను. వీరవర్మ తన్నుఁగాంచుచున్న సైనికులతో నెన్నోమాఱులు మయూరుని జూడవలయు నని చెప్పుచుండెను. వారు పలుసమాధానములు చెప్పుదురు. వారిసమాధానము నుండి వీరవర్మకుఁ దెలిసిన విషయ మే మనఁగా శాతవాహనరాష్ట్రములో నంగుళము మేఱ యైనను బల్లవచక్రవర్తి క్రింద లే దని.

ఒకనాఁటిప్రొద్దుట వీరవర్మకు మయూరుఁడు దర్శన మిచ్చెను. 'ఏమయ్యా! సేనాపతీ, క్షేమముగా నున్నావా' యని యడిగెను. వీరవర్మ యి ట్లనెను. 'ఓయీ! నీవు సేనాపతివో, మహారాజువో, నాకుఁ దెలియదు. నీవు నా కొకబ్రాహ్మణబాలుఁడవుగానే కనిపించుచున్నావు. నేను నీమొగముమీఁదఁ గొట్టితిని. నీవు నామొగముమీఁద వేయిరెట్లెక్కువ గొట్టితివి. నాల్గునెలలక్రింద నన్నును, నాసైనికులను వదలిపెట్టెదనంటివి. నా సైనికులేమైరి? న న్నేమి చేయ నెంచితి, వనెను. మయూర శర్మ సమాధానము చెప్పెను. 'అయ్యా! కోపింపకుము. నేను

ని న్నేమియుఁ జేయఁదలఁచుకొనలేదు. నిన్నును, నీసైన్యమును వదలిపెట్టినచో నేను నారాష్ట్రమునఁ జేసికొనవలసిన భద్రతకు భంగము వాటిల్లును. మీరుపోయి చక్రవర్తితో నాసంగతిఁ జెప్పుదురు. ఆయన నామీఁదికి మఱల సైన్యమును బంపించును. నే నాసైన్యముతో యుద్ధము చేయుచుందునా? నా రాష్ట్రము నంతయుఁ జక్కఁబఱచుకొనుచుందునా? రెండు నొక్కసారి చేయుట సాధ్యము కాదు. అందుచేత నేను నా రాజ్యమునంతయు జక్కఁబఱచుకొనుచుండఁగా మీవలన నేవార్తయుఁ జక్రవర్తికిఁ దెలియఁజేయనీయలేదు. నా పని పూర్తి యైనది. నిన్ను ఱేపే వదలిపెట్టెదను. కాని సేనాపతీ! నీ సైన్యము నీవెంట రాదు. నీవు మారాష్ట్రపుఁ బొలిమేరలు దాటినతరువాత నొక్కరొక్కరే నిన్నుఁ గలసికొందురు. నీవే కావు. పల్లవేంద్రనగరముల నైయోగికులు, వైజయంతీ పురాధ్యక్షుఁడైన రాజవల్లభుఁడు వీరి నందఱను నేను బందీలను జేసితిని. వారందఱను వదలిపెట్టుదునా, వలదా యన్న సంశయము నా కింకను దీరలేదు. వీరందఱను నావద్దఁ బూఁటగా నుంచెదను. పల్లవచక్రవర్తి మఱల నామీఁదికి సైన్యములు పంపించినచో వీరిప్రాణములు దక్కవని చక్రవర్తిని భయపెట్టెదను. నిజానికి నిన్నుఁగూడ వదలి పెట్టరాదు. నీవు వీరవర్మవు కానిచో వదలిపెట్టెడివాఁడను. నీనానడిమిసంబంధము రాజకీయసంబంధము కాదు. వ్యక్తిగతమైన సంబంధము. మొట్ట మొదట నిన్ను బట్టుకొనినప్పుడు ని న్నిట్లు చేయవలయు ననుకోనలేదు. అతొందఱలో మఱలఁ గొరడాతో నీమొగము మీఁదఁ గొట్టుటయే శిక్ష యనుకొన్నాను. నేను బాలుఁడను. నీవు వయస్సు

చేతఁ బెద్దవాఁడవు. నీ కాయమర్యాద చేయకపోవుటయే న్యాయముగా నుండును. సేనాపతీ! ని న్నొకప్రశ్న వేసెదను. ఈసారి చక్రవర్తి నామీఁది కెవరిని బంపు నని నీయుద్దేశ్య మసెను. వీరవర్మ యాలోచించి 'మహారాజా!' యని పిలిచెను. మయూరుఁడు ముక్కుమీఁద వ్రే లుంచుకుని యిట్లనెను. 'అయ్యా! నేను మహారాజును గాను. నేను సేనాపతిని గాను. శాతవాహన రాష్ట్రప్రజలకు నే నొక సోదరుఁడను. నాకు బ్రాహ్మణు లని, బెస్త లని భేదము లేదు. నీ కాసంగతి తెలియదేమో? నాతల్లి దండ్రుల కులము నాకుఁ దెలియదు. హారీతుఁడైన రామశర్మ నన్నుఁ బెంచిన తండ్రి. అందుచే నేను బ్రాహ్మణుఁడను. మేము కాదంబులము. మాదొడ్డిలోఁ గదంబవృక్ష ముండెడిదఁట. అందుచేత మ మ్మందఱుఁ గాదంబు/లనుచుండి' రనెను.

అంత వీరవర్మ యిట్లనెను. 'ఓయీ! నీవు నన్ను వదలిపెట్టినచో నీకొకయుపకారము చేసెదను. చక్రవర్తితోఁ జెప్పి నీమీఁదికి భల్లాతవర్మను బంపించెదను. ఇది నేను నీకుఁ జేయఁగల సాయము.'

మయూరుఁ డాలోచించెను. వీరవర్మ యనిన యీ మాటలలో వీరవర్మకుఁ జెఱ వదలించుకొనవలె నని యున్నది. మయూరుని శౌర్యపరాక్రమములయందు మెచ్చుదల యున్నది. తా నిదివఱకు మయూరున కపకారము చేసెను. ఆయపకారమునకు నిష్కృతిఁ జేయవలయునని యున్నది. మఱియు నింకేమైనఁ గలదా యని మయూరుఁ డూహ చేసి యిట్లనెను. 'నిజము చెప్పుము. నీవు సేనాపతివి. భల్లాతవర్మ సేనాపతికూడఁ

గాఁడు. వట్టి దళవాయి. సేనాపతి సాధించలేని కార్యము దళ వాయి సాధింపఁగలఁడా ? ఎక్కువవానికిఁ జేతకానిపనిని సాధిం చుటకుఁ జక్రవర్తి తక్కువవానిని బంపించునా ?'

వీరవర్మ యిట్లనెను. 'అయ్యా మయూర! నీవు మాటాడు చున్నకొలఁది నా కాశ్చర్యము వేయుచున్నది. నీ వయసునకు నీ వివేకమునకు, నీ సామర్థ్యమునకు నేను జాల యానం దించుచుంటిని. నేను నీ చేతిలోఁ జిక్కితినని యిట్లనుట లేదు. నేను ని న్నానాఁడు కొరడాతోఁ గొట్టినది నీయందు ద్వేష ముచేఁ గాదు. వీఁ డెవఁడో బుద్ధిహీనుఁడైన బాలుఁడు. చక్రవర్తికిఁ బరమప్రియుఁడైన భల్లాతవర్మమీఁద నభియోగము తెచ్చు నవి వేకి వని ని న్నట్లు తిరస్కరించితిని. అప్పటి నీయవివేకమునందు నాతిరస్కార ముండెను. కాని, వ్యక్తిగతముగా నాకు నీయందు లేదు. పైఁగా నీ వింతశక్తిమంతుఁడ వని తెలిసికొనుట యెట్లు ? భల్లాతవర్మ చక్రవర్తికిఁ బరమప్రియుఁడు. అతఁడు తలఁచు కొన్నచో మహాసేనాధిపతియే యయ్యెడివాఁడు. చక్రవర్తి కతఁ డంగరక్షకుఁడు. ఖడ్గవిద్యలో భల్లాతవర్మను మించినవాఁడు పల్లవసైన్యమందు మఱొక్కఁడు లేఁడు. అతఁడు వట్టి కసాయి. చక్రవర్తి శత్రురాజులను శిక్షింపవలయు నన్నచో నతనినే పంపించును. వాఁ డూళ్ళమీఁదఁ బడి దోచుకొనును. స్త్రీలను జెఱబట్టును. ఊళ్లు తగులఁబెట్టును. భల్లాతవర్మ పేరు చెప్పినచోఁ జాలును శత్రుగ్రామములు గడగడలాడిపోవు' ననెను. మయూర శర్మ 'మఱి యట్లయినచో భల్లాతవర్మను మాదేశముమీఁదికిఁ బంపించి మాగ్రామములు మఱలఁ దగులఁబెట్టింపవలయు

ననియా నీ యుద్దేశము' అనెను. వీరవర్మ 'మయూరా ! నీవు పగతీర్చుకొనుటకుఁ బుట్టితివి. నీపగఁ దీర్చుకొందు వని చెప్పితిని. నీవా ? వాని నూళ్ల తగులఁబెట్టనిచ్చెడిది' యనెను.

## ఏకాదశాధ్యాయము

సముద్రగుప్తుని దండయాత్ర వెనుదిరిగిపోయెను. సాలంకాయనుల యాంధ్రసైన్యములముందు సముద్రగుప్తునిసైన్యము నిలువలేకపోయెను. వ్యూహనిర్మాణములో, యుద్ధమునకుఁ దగిన స్థలములను వెదకుటలో, నాంధ్రసేనాపతుల వివేకాతిశయము సముద్రగుప్తునకే యాశ్చర్యము కలిగించెను. ఆనాఁటివఱకు నౌత్తరాహులకు దాక్షిణాత్యు లన్నచోఁ బరిహాసముగా నుండెను. తత్పూర్వము నాల్గువందలయేండ్ల క్రిందట శాతవాహనులు మగధముదాక గెలిచినమాట యౌత్తరాహుల యెడఁదలలో విస్మృతి పొందెను. ఆంధ్రసైన్యములు మెఱపువలె వచ్చును. శత్రుసైన్యమును దాఁకును. అంతసైన్య మంతతొందఱగా వచ్చి తాఁకుట యౌత్తరాహు లెఱుఁగరు. ఒకపక్షమున నాంధ్రసైన్యమోడిపోవుచున్న దని తెలిసినచో, సైన్యమంతయు మంచు విడిలినట్లు విడిలిపోవును. ఎక్కడనుండి వచ్చునో క్రొత్తదళము, మఱియొక దెసనుండి వచ్చి తాఁకును. అప్పుడు చెదరిపోయిన యాసైన్యము మఱలఁ బదువుకట్టి నూత్నోత్సాహముతో నెదిరించును. ఉత్తరదేశముకంటె దక్షిణ

దేశము పర్వతమయము. ఎచ్చటఁ జూచిన నేమో చిన్నగుట్టలే. చిన్నవాఁగులు, తాటితోఁపులు. ప్రతిగుట్టయు సైనిక రక్షణ స్థానము. లోతైన వాఁగులు. ఆవాఁగులలోఁ జిట్టియడవులలోని పొదలవంటి పొదలు. ఏపొదవెనుక నెంతసైన్య మున్నదో తెలియదు. ఆవలినుండి పదివేలసైన్యము వచ్చును. ఈవలి నుండి పదివేలు వచ్చును. ఒకపెద్దబయలైన ప్రదేశమున రెండుసైన్యములు నెదుర్కొనును. ఎవరు శక్తిమంతు లైనచో వారు గెలుతురు. ఆంధ్రసైన్యము లిట్లు కాదు. వాఁగులలోఁ జెట్ల వెనుక, కొండలయండ రహస్యముగా దాఁగియుందురు. వారి నెదిరించుటకై యాత్తరాహుల సైన్యము ముక్కలుగాఁ బోవలసియుండెను. బాహాబాహవియైన యుద్ధములో నాంధ్రులు, కసాయివాంధ్రకన్న ఘోరముగా నుండిరి. ఇంత యలజడి సముద్రగుప్తుఁడు తట్టుకొనలేకపోయెను. ఆమహాచక్రవర్తి సైన్యమునకుఁ దిండి దొరకలేదు. సైన్యములకు స్కంధావారము తీర్చి విశ్రమించుటకు వీలు లేకపోయెను. చివర కాయన సైన్యములను మఱలించుకొనిపోయెను.

ఆయనకు సాయమువచ్చిన యితరరాజులందఱుఁ గ్రమ క్రమముగాఁ దమసైన్యముతో వెడలిపోయిరి. పల్లవచక్రవర్తి యొక్కఁడే పూర్తిగాఁ బోలేదు. ఆయనసైన్యములలో సగము సైన్యము కాంచీనగరాభిముఖమై పోయెను. రెండువేల యాశ్విక దళము, నాలుగువందల యేన్గులు, పదివేల పదాతులుఁ జక్రవర్తి వద్దనే యుండిరి. చక్రవర్తి వేంగీనగరప్రాగ్దిశాభాగమున నొక మహాసౌధములో విశ్రమించియుండెను. ఆయనవద్ద నతని

పాదసంవాహకుఁ డుండెను. దూరముగాఁ జేతులు జోడించుకొని వీరవర్మ నిలిచియుండెను. భల్లాతవర్మ ప్రభువులకు దగ్గఱగా నున్న యొకయాసనముపైఁ గూర్చుండి నడుమనడుమ తేచుచుఁ బ్రభువున కేదైన వలసినచో నందిచ్చుచు నుండెను. చక్రవర్తి శివస్కందవర్మనేత్రములలోఁ గోపోత్సాహములు రెండును మిళితములుగా నుండెను. కొంతసేపటికిఁ బ్రభువి ట్లనెను. 'సేనాపతీ! నీవేమో పోయి యావిప్లవకారుని మర్దించివత్తు వని యనుకొంటి' నని పాదసంవాహకుని వంకఁజూచి 'నాగా! యాకుఱ్ఱవానివయ స్సెంత యని యంటివి' యనెను. పాదసంవాహకుని పేరు నాగన్న. నాగన్న 'పదునెనిమిదేం డ్లుండవచ్చు నని యనుకొందును మహాప్రభూ' యనెను. ప్రభువు వీరవర్మతో నిట్లనెను. 'మయూరశర్మకుఁ బదునెనిమిదేండ్లు. నీకు నలుబది యేండ్లు. వారడి యిఱువది రెండేండ్లు. ఇఱువది రెండు నెలలు కా దాయెను. ఇఱువది రెండు దినములు కా దాయెను. ఏలెక్క ప్రకారము నిన్ను నాలుగునెలలు బందిలోఁ బెట్టెను?' వీరవర్మకు దేహమంతయు ముళ్ళు గ్రుచ్చుకొన్న ట్లుండెను. గోరుచుట్టుపై ఱోకంటిపో టన్నట్లు భల్లాతవర్మ యి ట్లనెను. 'ప్రభూ! వాఁడు వయసులోనున్న వారడి చూడలేదు. సేనాపతివయసే చూచెను. నలుబదియేండ్లు గనుక నాలుఁగునెల లుంచెను. పదియేండ్ల కొక్కనెల. ఏడాదికి మూఁడుదినములు.' ఇట్లు మఱి యేసేనాపతియుఁ బ్రభువుతో మాటాడఁడు. ప్రభు వి ట్లనెను 'మయూరశర్మ నీ కన్నము పెట్టక మాడ్చలేదు. నీ వేమియుఁ జిక్కలేదు.' భల్లాతవర్మ యనెను. 'చివరి కతనితోఁ దులాయుద్ధము చేసినను

జేయవచ్చు' ననెను. వీరవర్మకుఁ గోపము వచ్చెను. వీరవర్మ ప్రభువునెదుట ము న్నెప్పుడు సాహసించి మాటాడినవాఁడు కాఁడు. భల్లాతవర్మకు నిట్లు బదులు చెప్పెను. 'నేను భల్లాత వర్మగారియంత ఖడ్గవిద్యా విశారదుఁడ నైనచో నట్లు చేసెడి వాఁడనే. నేను భల్లాతవర్మగారియొక్క పక్ష మవలంభించి యాతనిమొగమునఁ గశాఘాతము చేసితిని. ఆకశాఘాతమునకు మయూరశర్మ కోపించలేదు. భల్లాతవర్మ యనుగ్రహించలేదు.'

వీరవర్మ మంచి విద్యావంతుఁడు. మాటలో నేర్పరి. ఆతనిమాట ప్రభువునకుఁగాని, భల్లాతవర్మకుఁగాని కోపము కలిగించలేదు. వీరవర్మకోపము వానివాక్యములలో దూరస్ఫూర్తి కలదిగా నుండెను. వీరవర్మ తన్ను మెచ్చుచున్నాఁ డని భల్లాత వర్మ యనుకొనెను. వీరవర్మ యీమాటలలో నుద్దేశించిన ప్రయోజనము భల్లాతవర్మ కంతు పట్టలేదు. ప్రభువి ట్లనెను. 'ఓయి సేనాపతి! మయూరునకు నీమీఁదఁ గోపము రానిచో ని న్నెందులకుఁ జెఱలోఁ బెట్టెను? నీసైన్యమునెల్ల నెందుకు ఛిన్నాభిన్నము చేసెను?' వీరవర్మ యి ట్లనెను. 'ప్రభూ! అతనికి నామీఁద నచ్చముగాఁ గోపము లేకపోలేదు. ఆకోపము కొంచెమే. దానికిఁ బ్రతిక్రియఁ జేసెను. మహాచక్రవర్తులైన తమరిమీఁదఁగూడ నతనికిఁ గోప ముండెను. ఆకోపమువలననే మనసైన్యమునతఁడు పరాభవించెను. తమరియందు గౌరవము, నాయందు దయయుఁ గలిగి, నిరాయుధులుగాఁ జేయఁబడిన తమసైన్యమును దమకుఁ దిరిగి పంపించెను. నన్ను ప్రాణము లతో వదలిపెట్టెను.'

ఈ మాటలకుఁ జక్రవర్తి సంతోషించెను. భల్లాతవర్మకుఁ గోపము వచ్చెను. చక్రవర్తి యిట్లనెను. 'మామీఁద నతనికి గౌరవమున్నదా ? అతనిగౌరవము కనిపించునట్లు ప్రవర్తించ లేదే ? మాయందఱికి గౌరవమున్నట్లు నిదర్శన మే మున్నది?' యని. వీరవర్మ సమయము దొరికిన దని పదిమాటలు కలిపించి మొదలుపెట్టెను. 'ప్రభూ ! ఈనాల్గునెలలలోఁ బదిసార్లయినా మయూరుఁడు నాతో మాట్లాడెను. ఎన్నిసార్లు చెప్పినను మీ రెవ్వరును నాకుఁ బ్రభుదర్శనము చేయించలేదు. ప్రభువు న్యాయమూర్తి యని వింటిని. ఈ ప్రయత్నమంతయుఁ బ్రభు దర్శనముకొఱకే చేయుచున్నాను. ప్రభు వొక్కసారి నాకుఁ గనిపించినచో నీసర్వ ప్రయత్నము మానివేసెద' ననెను. నే నంటినిగదా, 'యేమయ్యా ! ప్రభువు నీవద్దకు వచ్చి దర్శన మిచ్చునా ? ప్రభువుయొక్క సేనాపతులనిట్లు పరాభవించినచోఁ బ్రభువునకనుజ్ఞ కలుగునా ? ప్రభుదర్శనము చేయుట కిది మార్గముకా' దని. 'నేను సేనాపతిని. ఖడ్గహస్తుఁడను. ప్రభు దర్శనమునకు నా కిదియే మార్గ' మని యతఁ డనెను. నే నతనితో నాలుగైదుసార్లు చెప్పితిని. 'ఓయీ ! నీవు పొరపాటు పడు చున్నావు. నీకు నిజముగాఁ బ్రభుభక్తి లేదు. నే నెట్లునుబోయి నీ వన్నమాటలు ప్రభువుతోఁ జెప్పుదును. నీయందుఁ బ్రభువు దయఁగల వాఁ డగును. ఈలోపుగా నీవు నీసైన్యమును గట్టి పఱచుకొనవచ్చునని నీవు చెప్పెడు నీతిమాట లివి. నేను నీవు న్యాయమైన యుద్ధము చేయుదు వనుకొంటిని, దానికిదోఁడు నీ కా నాఁటిప్రళయవర్షము సహాయ్యము చేసెను.మఱల నీమీఁదికి వచ్చు

సేనాపతులు నీకితవయుద్ధమునకు సిద్ధముగానే వత్తురు. నీ కస లెవరిమీఁదఁ బగయో యాభల్లాతవర్మను నీ వెఱుఁగవు. ఆయన చండప్రచండుఁడు. నాఁడు నిన్నుఁ మిగిల్చినదానికే సంతోషించుము. నిన్ను నీతల్లిదండ్రులదారిఁ బట్టించు' నని కొన్ని కోపపుమాట లంటిని ప్రభూ ! నిజముగా భల్లాతవర్మగారియొక్క ప్రతిభ వానికిఁ దెలియదు. అతఁడు పసివాఁడైనను దెలివిగల వాఁడేకాని మహాసేనాపతుల నెదిరింపఁజాలఁడు. ఒకచిన్న విప్లవకారుఁ డని నే ననుకొంటిని. కానిచో నావ్యూహరచన మఱియొకవిధముగా నుండెడిది. నే నెంత చెప్పికొన్నను ప్రభువులకు నామీఁద దయ రాలేదు. ప్రభుకార్యము భంగము చేసినందులకుఁ బ్రభు వేశిక్ష విధించిన నాశిక్ష స్వీకరించుటకు సిద్ధముగా నున్నా' ననెను. ప్రభువు వీరవర్మతో ని ట్లనెను. 'మయూరుఁడు ని న్నేల వదలిపెట్టెనో మా కింతవఱకుఁ దెలియలే' దని. వీరవర్మ భల్లాతవర్మవంకఁ జూచెను. ప్రభువువంకఁ జూచెను. ఇ ట్లనెను. 'ప్రభూ ! అతఁడు న న్నేల వదలిపెట్టెనో నేను చెప్పనక్కఱలేదు. నే నట్లు చేసినచో వదలిపెట్టెద ననెను. నేను సరే నంటిని. అతఁడు వదలిపెట్టెను.' భల్లాతవర్మ వీరవర్మను బ్రశ్నించెను. 'అతఁ డెట్లు చేయు మనెను. నీ వెట్లు చేసెద నంటివి ?' వీరవర్మ 'ఈసందర్భములోఁ బ్రభు వింకొక రీతిగా జేయఁడు. చేసి లాభము లేదు. అందుచేతఁ జెప్ప నవసరము లేదు. కాదు, కూడదు ప్రభువు వినవలయు నన్నచో మనవి చేసికొందు' ననఁగా జక్రవర్తి చెప్పు మన్నట్లు నేత్రదృష్టి పఱచెను. వీరవర్మ యి ట్లనెను. 'ప్రభూ ! నే నాకుఱ్ఱ

వానితోఁ జెప్పితిని. అతఁడు వినలేదు. అతనికట్టుతాత్రి శ్రుతఁడు తెచ్చుకొనుచుండెను. నే నెన్నిసార్లు వ ద్దన్నను నతఁడదియే మాటగాఁ బట్టుపట్టుకొని కూర్చుండెను. ఈసారి యతనిమీఁదికి భల్లాతవర్మగారిని బంపించవలసినదిగాఁ బ్రభువులతో మనవి చేయవలసిన దని యతఁడు నాతోఁ జెప్పెను. 'అయ్యా! బాల సేనాపతీ! నీకు సంగతి తెలియదు. భల్లాతవర్మ గండరగండఁడు. బహుయుద్ధములలో నాఱితేరినవాఁడు. కితవయుద్ధపరిజ్ఞానము వారి కున్నంత మఱియెవ్వరికి లేదు. నీవేమో చక్రివ ర్తిదర్శ నము వాంఛించుచున్నవాఁడవు. నీవు చనిపోయినతరువాత నీకుఁ జక్రివ ర్తిదర్శన మె ట్లగును ? భల్లాతవర్మ నీమీఁదికి వచ్చు టయుఁ దరువాత నీవు చక్రివ ర్తిదర్శనము చేయుటయు నివి రెండును నొకదాని కొకటి పొసగని సంగతు లని నాలుగైదు సార్లు చెప్పితిని. అతఁ డెంత సేపటికి 'నష్టే కానీవయ్యా! సేనా పతీ! భల్లాతవర్మ చక్రివ ర్తికి మిక్కిలి యాత్మీయుఁ డని చెప్పు చుంటివిగదా! నేను జనిపోయినచో భల్లాతవర్మపదవికి భంగము లేదు. వాఁడే చనిపోయినచో— ప్రభువు క్షమింపవలయును. అతఁడు భల్లాతవర్మనుగుఱించి మాటాడినప్పుడు మిక్కిలి తిరస్కరించి మాటాడును. వాఁడు వాఁ డనియే యనును. నే నతఁ డన్నమాటయే వాడుచున్నాను— వాఁడు చనిపోయినచో వాని మాఱు ప్రభువునకు నే నాత్మీయుఁడ నయ్యెద ననెను. మఱియు నే ని ట్లంటిని. 'నీవంటి యకృతహస్తునిమీఁదికిఁ బ్రభువు భల్లాత వర్మను బంపించఁడు. ప్రభువునకుఁ బాతికమంది యితరసేనా నులు గలరు. ఎవరిని బంపించినను బంపించును. ఓయి బాల

సేనానీ! నీ వన్నచో నాకు జాలి కలుగుచున్నది. నీవు బుద్ధి మంతుఁడవు. శూరుఁడవు. బ్రతికి బట్టఁ గట్టఁదగినవాఁడవు. ప్రళయ కాళికాకృతి భల్లాతవర్మ నేరి కోరి యేల నీమీఁదికిఁ దెప్పించు కొందు' వంటిని. నే నిట్లనఁగా మయూరునకు మిక్కిలి కోపము వచ్చెను. వచ్చి 'నీ వావాగ్దానము చేయనిచో నిదిగో యిప్పుడే నీశ్శిరస్సు నఱకుచున్నా' నని కత్తి యెత్తెను. 'నాసొమ్మేమి పోయినది. నీమేలునకే చెప్పితి' నని వాగ్దానము చేసి ప్రభువు వద్దకు వచ్చితిని. ప్రభువున కుపయోగపడని నావంటివాని మనవి యంగీకార్య మగునో లేదో తెలియదుగాని, యొకటి యభ్యర్థించుచున్నాను. మయూరుఁడు బాలుఁ' డని భల్లాతవర్మ వంకఁ జూచెను. భల్లాతవర్మ మండిపోవుచుండెను. అతని కన్నులు కణకణ లాడుచుండెను. వీరవర్మ మఱలఁ బ్రభువును జూచి యిట్లనెను. 'ప్రభూ! భల్లాతవర్మగారు మిక్కిలి కోపముగా నున్నారు. నే నేమి చెప్పినను లాభ మున్నట్లు గాని పించదు. భల్లాతవర్మగా రాపసిబాలునిమీఁదఁ గసి తీర్చుకొనకుండ నుండరు. అతఁడును బ్రభువున కింత యపకారము చేసెను. నే నే మనుటకు వీలు లే' దని యూరకుండెను.

———

# ద్వాదశాధ్యాయము

చక్రవర్తి వెంటనే మయూరశర్మమీఁదికి భల్లాతవర్మను బంపించలేదు. భల్లాతవర్మకు మయూరశర్మమీఁదఁ బోవలెనని యెంత తొందఱ యుండెనో చక్రవర్తి యంత జాగు చేసెను. ఒక దినమున భల్లాతవర్మ చక్రవర్తితో నిట్లనెను. 'మహారాజా! మీకు మయూరశర్మమీఁద నభిమానము కలదు. అందుచేతనే యింతజాగు చేయుచున్నారు. అతనికి వీరవర్మమీఁదఁ గోపము లేదు. ప్రభువులమీఁద భక్తియే కలదు. ఒక్క నేనే వానికి విరోధిగాఁ గనిపించుచున్నాను. ఈసంవత్సరము సంవత్సర మంతయు శాతవాహన రాష్ట్రిముమీఁది కప్పము చక్రవర్తిటంక సాలకుఁ జెల్లుబడి కాలేదు. మన కెట్లు చూచినను యుద్ధములే. ఈయుద్ధములు ధనము లేకుండ నెట్లు సాగును ? ఆమయూరశర్మ శాతవాహనరాష్ట్రిముతో నూరకొనలేదు. త్రికూటము, ఆభీరము, పారియాత్రికము, శకస్థానము నాక్రమించుకొన్నాఁడని మన కిదివఱకే వార్తలు వచ్చెను. ఇంక నేయేరాష్ట్రిము లాక్రమిం చునో మనకుఁ దెలియదు. అతని యుద్ధృతి యింతలోఁ దగ్గించక పోయినచో నతఁడు చక్రవర్తికి లొంగఁడు. మొక్కయై వంగక

ప్రమాణ్మైవంగదు. వీరవర్మ మనతో నతని వార్త చెప్పి యప్పుడే మూఁడునెల లైనది. బుధ్యంకరమహాసేనాని తిరుగఁబడిన బృహత్పలాయనులమీఁద, నానందులమీఁద దండయాత్రకుఁ బోయెను. ప్రభువులకు నాయందున్న ప్రేమచేతఁ దమవద్దనే యుండు మందురు. నేను ప్రభుసేవ మఱియొకరీతిగాఁ జేయ నెంచుచున్నాను.'

అంతఁటఁ జక్రవర్తి యిట్లనెను. 'మయూరశర్మ పసి వాఁడు. నీ వాఱితేరినవాఁడవు. నీవు మా కొకవాగ్దానము చేసి నచో నిన్నతనిమీఁదికిఁ బంపింతుము. అతనిని జీవగ్రాహ ముగాఁ దీసికొని రావలయును. నీ వతని కుటుంబము నిదివఱకే నాశనము చేసితివి. అంతనేర్పుగల బాలుఁడు వృద్ధిలోకి రాఁదగిన వాఁ' డని. భల్లాతవర్మ మఱల ననెను. 'ప్రభూ! నేను మనవి చేసితినిగదా! తమ కతనిమీఁద దయ యున్న దని. అతనిని జీవ గ్రాహముగాఁ దీసికొనిరావలయు నన్నచో మహాసేనాపతి నతనిమీఁదికిఁ బంపింపుఁడు. మఱియొకటి చూడుఁడు. నన్నతఁడు సర్వదా సంహరింపఁజూచుచుండును. నే నతనిని జీవగ్రాహ ముగాఁబట్టి తేఁజూచుచుందును. అది వానికి లాభముకదా!' అనఁగాఁ జక్రవర్తి 'వాఁడు పసివాఁడు కదా' యనెను. భల్లాత వర్మ 'కత్తి చేతిలో నుండఁగాఁ బసివాఁడేమి, పెద్దవాఁడేమి! వీర వర్మ తీసికొనిపోయిన సైన్యము నట్లు వంచించినవాఁడు యుద్ధ నీతిలో నాఱితేరినవాఁడుకాని బాలుఁడు కాఁడు. వయసుచేత బాల్యము లెక్క పెట్టరాదు. కృష్ణాహగరీనదులమీఁద వాఁడు చేసిన యత్నము బాలుఁడు చేసెడు యత్నమా? చక్రవర్తికి

దయ పుట్టినచో దాని కొకమేలు యుండవలయును. నిన్నునేకదా బుధ్యంకరసేనాని ధనము కావలె నని కబురంపెను. కాంచీనగరమునుండి మహామాత్యుఁడు బొక్కసములో ధనము లే దని వార్తఁ బంపించెను. వెంటనే బుధ్యంకరునకు ధనము పంపించనిచో బృహత్ఫలాయనుఁడైన జయవర్మ మన కందిరాడు. జయవర్మగాని, యానందుఁడైన దామోదరవర్మగాని మనకుఁ దేలికగా లొంగువారు కారు. వీరిద్ద ఱనాదినుండియు నిక్ష్వాకుప్రభువుల సామంతులు. సముద్రతీరములు వారిచేతులలో నున్నవి. ప్రభువు లిక్ష్వాకురాజును గెలిచిరేకాని, వారి సామంతులను లొంగఁదీయలేదు. జయవర్మ కృష్ణానదీసాగరసంగమదేశ మంతయుఁ దనచేతిలోఁ బెట్టుకొని కూర్చుండెను. అది సుభిక్షమైన దేశము. ఇక్ష్వాకురాజుల సర్వనౌకాదళము జయవర్మ చేతిలో నున్నది. బుధ్యంకరుఁడు బృహత్ఫలాయనుల మహానగరమైన కోడూరుమీఁదికి దండయాత్ర పోయెనేకాని, కోడూరుపరిసరములైనను సేనాపతిఁ జేరఁగట్ట వీలు లేకుండెను. ఆనందుల కందరాపురముకూడ మన కభేద్యముగా నుండెను. తమరు నన్ను బృహత్ఫలాయనులమీఁదికిఁ బంపింతు మందురు. నే నచ్చట బుధ్యంకరునికన్న నెక్కువ చేసెడి దేమి? నేను శాతవాహనరాష్ట్రముమీఁదికిఁ బోయెదను.'

ఈప్రసంగము చక్రవర్తికి, భల్లాతవర్మకుఁ బదిదినములలో జరుగుచుండెను. ఈలోపుగాఁ జారులు వచ్చి మయూరశర్మ పూర్వ మాక్రమించుకొనిన రాష్ట్రములేకాక సైయందకము, పునాతము, మోకరి యను దుర్గములుకూడ సులభ

ముగా గెలిచె నని వార్తలు చెప్పిరి. ఈమూఁడుదుర్గములు, వానిచుట్టుపట్ల నున్న రాష్ట్రములు సారవంతమైన దేశము. బుద్ధ్యంకరునకు ధనము పంపించుటకు నీమూఁడుదుర్గాధిపతులకుఁ జక్రవర్తి యాజ్ఞ పంపించెను. ఈమూఁడుదుర్గములు మయూరశర్మచేతిలోఁ బడఁగా నచ్చటినుండి మహాసేనాపతికి ధన మెట్లు చేరును ? రాజసైన్య మే మగును ? చక్రవర్తి కప్పుడు కోపము వచ్చెను. భల్లాతవర్మ యాసమయము చూచి యిట్లనెను. 'ప్రభూ ! ఇంక నుపేక్షించినచోఁ దొండ ముదిరి యూసరవెల్లి యగును. ఇప్పటికే మీదయవలన వాఁడు ముదిరి పుంజుకొనెను. ఈమూఁడుదుర్గములయొక్క యధిపతులు సుంకములు వసూలు చేసి కోటలో నుంచితిమని వార్తలు పంపించిరి. ఆధన మంతయు మయూరశర్మయధీన మయ్యెను. వెంటనే యాధనమునైనను మనము స్వాధీనము చేసికొననిచోఁ బల్లవసైన్యము కృష్ణాముఖదేశమునందు మిక్కిలి యిబ్బంది పడు' నని నంతనే చక్రవర్తి భల్లాతవర్మను మయూరశర్మమీఁదికిఁ బొమ్మని యాజ్ఞ యిచ్చెను. పదివేల పదాతులు, నాలువందల గజములు, పదునేనువందల గుఱ్ఱములు నీమహాసైన్యమునకు భల్లాతవర్మ సేనానియై పోవలయును.

భల్లాతవర్మ మఱలఁ బ్రభువుతో ననెను. 'స్వామీ ! మయూరశర్మ పట్టుబడినచోఁ దీసికొనివచ్చెదను. లేనిచో వానిశిరస్సుమాత్రమే తేఁగలుగుదును.' చక్రవర్తి తల యూఁపెను. భల్లాతుఁడు ప్రళయరుద్రాకారుఁడై యుండెను. రెండేండ్లకుఁ బూర్వము మయూరశర్మమీఁదఁ గలిగినకోపము క్రమ

క్రమముగా వృద్ధి నొందుచు, భల్లాతవర్మహృదయములో నిప్పటికిఁ బ్రళయాగ్నివలె మండుచుండెను. మయూరశర్మ కనిపించుటతోడనే వానిని నూరక త్రాగవలయు ననిపించు చుండెను. అంతటిమహాకోపములోనను భల్లాతవర్మమనస్సులో నొకమూల నొకవిచిత్రమైన సందేహ ముండెను. రెండేండ్ల క్రింద బ్రాహ్మణబాలుఁడుగాఁ దనయింటికి వచ్చిన మయూరుఁడు తన్నధిక్షేపించి పోవుచుఁ దనసైనికులు నలుగురు వెంటఁబడఁగా నడుముననున్న పట్టాకత్తి విదిలించి ఝుళిపించిన ప్రళయవేగము భల్లాతవర్మమనసులో నిప్పటికిని నిలచియుండెను. కత్తి లాగుటలోఁ దా నెంత వేగరియో యాబాలుఁడు నంత వేగరిగా నుండెను. కాని భల్లాతునిమనస్సులో నొకధైర్య ముండెను. ఈవేగము కొంత యభ్యాసముచేతఁ బ్రాప్తించినను, శరీర రక్తస్రోతస్సునందలి సహజఝురీవేగవల్లనముచేతఁ బ్రాప్తించునది. కాని ఖడ్గవిద్యానైపుణ్యము వేఱువిషయము. వానినిగుఱించి యింతటి చర్చ యేల? వానినిఁ బిట్టనువలెఁ జేతులతో నలిపి వేయుదును. వానితోఁ దాను గత్తియుద్ధము చేయుటదాఁక దేనికి వచ్చును? కాదు, వాఁడు తన్ను నిందించెను. తన్ను దిరస్కరించెను. తనయంతవాఁడు తనమీఁదకఁట, రావలయు నఁట! వీరవర్మ చేసిన హితోపదేశమునకుఁగూడ లెక్క చేయ లేదు.

భల్లాతుఁడు సైన్యమునంతయు సన్నాహపఱచెను. దుర్గములు ముట్టడించుటకుఁ గావలసిన సాధనము లన్నియు సమకూర్చెను. పదిదినములలోఁ బ్రయాణ మేర్పాటు చేసెను.

వీరవర్మను జక్రవర్తి యీనాల్గునెలలు మజల సేనా నాయకుఁడుగా నెచ్చటకుఁ బంపించలేదు. తనయుద్యోగము పోయెనో, యుండెనో వీరవర్మకుఁ దెలియదు. వీరవర్మ మయూరశర్మకు రహస్యచారుఁ డయ్యెను. అతనిరహస్య చారత్వ మంతయు భల్లాతవర్మదండయాత్రనుగూర్చి మాత్రమే. తక్కిన రాజరహస్య మొక్కరవ్వంతయుఁ గబు రంపడు. భల్లాత వర్మవార్త యెప్పటి కప్పుడు కబు రంపించెను. చివరివార్త భల్లాతవర్మ పదివేలమందిభటులు, పదునేనువందల గుఱ్ఱములు, నాలువందల యేనుఁగులతో బయలుదేరుచుండె నని వార్త పంపించెను. సైన్య మీమార్గమున వచ్చు ననిగాని, ప్రధాన ముగా సైయందక, పునాత, మోకరిదుర్గములఁ బట్టుకొనుటకు వచ్చుచున్నాఁ డనిగాని వార్తలో లేదు. మజల నది రాజరహ స్యము. మయూరశర్మ తెలివిగలవాఁడైనచోఁ దానే వాని నన్నింటిని సరిచూచుకొనవలయును.

మయూరశర్మ యీయైదునెలలును వీరవర్మవార్తలు జాగ్రత్తగాఁ బరిశీలించుచునే యుండెను. వీరవర్మ యెంత వాగ్దానము చెసెనో యంతియే జరుగుచుండెను. రాజద్రోహ మొక్కింతయుఁ జేయుటలేదు. భల్లాతవర్మను తనమీఁదికిఁ బంపింతునన్నాఁడు. పంపించుటకు సర్వప్రయత్నములు చేసెను. చివరకుఁ బంపించుచుండెను. ఇంతకు మించి వీరవర్మ చేయఁడు. అతఁడు చేయవలయు నని మయూరశర్మ కోరఁడు. కాని మయూరశర్మ మనసులోఁ జక్రవర్తిసేనానాయకులయం దొక యమోఘమైన గౌరవ మేర్పడెను. మయూరశర్మ యొక

దానికి సంతోషించెను. దానికి దైవముకూడఁ దోడ్పడెను. బృహత్పలాయునులతో యుద్ధమే లేనిచోఁ జక్రవర్తి బుధ్యంకరునిఁ దనమీఁదికి బంపించెడివాఁడు. బుధ్యంకరుఁడే తనమీఁదికి వచ్చినచో నింక యుద్ధ మే మున్నది ? భల్లాతవర్మమీఁదఁ దాను పగ తీర్చుకొనుట యే మున్నది ? ఇప్పటికి మయూరునకుఁ బందొమ్మి దేండ్లు. ఇంతవఱ కతనికి భగవంతుఁ డని, దేవుఁ డని, భక్తి యని యేర్పడలేదు. అతఁడొక్కసారి యాలోచించెను. భల్లాత వర్మ తనమీఁదికి వచ్చుటకు వందయడ్డంకులున్నవి. అన్నియుఁ దొలఁగిపోయెను. భల్లాతవర్మ వచ్చుచుండెను. ఇన్ని యడ్డంకులు తొలఁగిపోవుట, తనపగ తీర్చుకొనుటకు వీలుగా నన్నియు నేర్పడుట - ఇది యెట్లు జరిగెను ? దీనికెవ్వరు కారణము ? చక్రవర్తి భల్లాతుని బృహత్పలాయనులమీఁదికో, యానందుల మీఁదికో పంపించినచోఁ దనపగ యెట్లు తీరెడిది ? తనకసి యే మయ్యెడిది ? తనపితృఋణముక్తి యెట్లు జరిగెడిది ? భల్లాతవర్మ తనమీఁదికి వచ్చుటకుఁ దాను కారకుఁడు కాఁడు. అన్నియు నట్లు పొసగినవి. ఈ పొసగుదలలోని రహస్య మేమి ? మయూరశర్మ హృదయములో నీరహస్యమే భగవంతుఁ డనిపించెను. ఆ భగ వంతుఁడే శివుఁడు.

శాతవాహనరాష్ట్రమంతయు మయూరునిచేతిలోనికి వచ్చి నప్పటినుండియు నతఁడు స్థానాకోడూరులో నివసించు చుండెను. పూర్వపు తమగృహము బాగుచేయించెను. ఆగృహములోనే తననివాసము. నివాస మనఁగా నెల కొకదినమో రెండుదిన ములో సైన్యముల పరామర్శకాని, నూతనదుర్గముల ముట్టడికాని

తనొత్తిడి పెట్టనప్పుడు పోయి యా గృహములో నుండును. ఆయింటివెనుకఁ బిడుకల గుడిసెయు, దానిముందరి చొప్ప గూడును మఱల నేర్పాటు చేసెను. తా నా యింటికిఁ బోయి నప్పుడెల్ల నొకకొంతసే పారెంటినడుమ నుండి తనతండ్రిని భల్లాతవర్మ నఱికినచోటునే చూచుచుండును. గంగయు, రామశర్మయు నిప్పుడు స్థానాకోడూరున నాయింటనే యుండిరి. వా రిరువురు కొడుకువలన మహాసుఖము ననుభవించుచుండిరి. శాతవాహనరాష్ట్రమునకు వైజయంతి రాజధాని. స్థానాకోడూరు రాజనివాసము. రాజనివాస మనఁగా రాజో, సేనానియో తెలియని మయూరుని బెంచిన తల్లిదండ్రులుండు గ్రామము. ఇంత చేసి మయూరుఁడు తాను రాజు ననఁడు. తాను సేనాపతి ననఁడు. తాను రాజభోగము లనుభవించఁడు. ఆపూర్వపు స్థానాకోడూరులో సామాన్యగృహములో నివసించును. మయూరుని యీమహావినయముచేత శాతవాహన రాష్ట్రము మఱియు నతఁడు గీసినగీఁతలో నుండెను. ఇప్పటికి మయూరునకుఁ బదిమంది సేనానులు కలరు. అందఱు నలుఁబది యేబదియేండ్ల మధ్యవారు. ఇక్ష్వాకులనాఁటివారు. వారును మయూరుని యాజ్ఞలో నడతురు. వీరందఱు మయూరునకుఁ గుడిభుజము. మయూరుని కనుసన్న వెంట ముల్లోకములు ముట్టడించు సాహసము కలవారు.

మయూరునకుఁ బదాతిసైన్య మున్నది. అతని పదాతి సైన్యముయొక్క సంఖ్య నాల్గులక్షలు. అనఁగా శాతవాహన రాష్ట్రమునందలి సర్వప్రజయు ననమాట. అతనియాశ్వీక దళము వేయిమంది. ఇందులో నైదువందలు, నైదువందల

గుఱ్ఱములు వీరవర్మ యిచ్చిపోయినవి. అతనికి గజసైన్యము లేదు. గజసైన్యము బదులు వేయిమంది ప్రత్యేకయుద్ధభటులు కలరు. వారు వేయిమందిని మయూరుఁడు శిక్షించిన శిక్షయే విచిత్రముగా నుండెను. ముక్కాకలుతీరిన మయూరుని సేనాపతులు పదిమందియు మయూరుని యీ మహాప్రతిభకే వానికి దాసోఽహమందురు.

మయూరునివద్దఁ బదియేనుఁగులు కలవు. అవి వైజయంతీ నగరములోనివి. అవి యుద్ధగజములు. ప్రతిదినము సాయంకాలమున మయూరుఁడు తన వేయిమంది ప్రత్యేకగజసైనికులకు నీ పదియేనుగుఁలతో యుద్ధము నేర్పును. ఆయేనుఁగులకు సారా పోయించును. అవి ప్రళయఘీంకారములతో నీ వేయిమందిమీఁది కుఱుకును. అప్పుడు మయూరుఁడు కొయ్యకత్తి యొకటి పుచ్చుకొని వానిమీఁదికి దూఁకును. ఆకత్తితోఁ నేన్గు తొండము నఱకుదెబ్బ యిది. దంతములుభేదించు దెబ్బ యిది. పాదములు ఛేదించు దెబ్బ యిది. ఏన్గునడుముక్రిందిగా బిగించిన హౌదాకట్టుత్రాళ్లు నఱకుట కీ యేడుపు చేయవలయునని తన వేయిమంది సైనికులకు నేర్పును. ఆయేనుఁగుల కండకుండ బ్రక్కవాటులుగా లంఘించును. ఒకఁ డేన్గుతొండము నఱకఁ బోఁగా నేన్గుపైనున్న సైనికుని శస్త్రములు వీనికిఁ దగులకుండ మఱియొకఁ డంగరక్షకుఁ డుండును. మయూరుఁ డీవిద్య నెచ్చట నేర్చెనో తెలియదు. ఈవేయిమందికి సింహసైన్యమని పేరు. ఈ సింహముల భోజనము నిత్యము మయూరుని విమర్శతో నుండును. వారి యాహారము పరిమితము. వారికి

వ్యాయామము కొలత. వారుకుక్కఖడ్డీలవలె నుందురు. వారిని జూచినచో వారిశరీరలాఘవము, వారిబాహుబలము సుంతయుఁ దెలియదు. వాఁడొక్కొక్కఁడు కత్తితో నఱికి యేనుఁగును రెండుతుండెములు చేయఁగలఁడు. ఒక్కఁ డొక్కఁ డేన్గు తొండము నఱికి దంతములు పూని వ్రేలాడి యేనుఁగుల వదనములు కత్తులతోఁ గ్రుమ్మఁగలఁడు.

మయూరుని యీ సర్వసైన్యము నొకయెత్తు. అతని చెలికాఁడైన కుబ్జుఁ డొకయెత్తు. కుబ్జుఁడును ముప్పదియేండ్లవాఁడు. షట్ఛాస్త్రవేత్త, మహాకవి. ఒకనాఁ డొకపల్లెగ్రామములో మయూరునకుఁ గుబ్జుఁడు కనిపించెను. మయూరుఁడు కనిపించినంతనే సర్వజనులు గౌరవింతురు. అతనిశౌర్యపరాక్రమము లగ్గింతురు. ఎవ్వఁడు నతని నిందించఁడు. నిందించి బ్రతికిపోఁడు. ఆమొదటివాఁడు కుబ్జుఁడు. మయూరున కెదురుగా వచ్చి 'ఓరికుబ్జవాఁడా! నీకు భగవంతుఁ డిచ్చిన తెలివితేటలేకాని విద్యచేతరాఁదగిన వివేకము లే' దనెను. మయూరుఁడు 'నాకంటె నీ వెక్కువ వివేకివా?' యనఁగా నతఁడౌననెను. అయినచో దనఁ వెంట రమ్మని మయూరుఁడనెను. నాఁడు మొదలు కుబ్జుఁడు మయూరునకుఁ దోడునీడ. కుబ్జుఁడు మయూరునకు సర్వగ్రంథములలో నున్న మహావిషయములు పదినెలలలోఁ బుక్కిటిపురాణములుగాఁ జెప్పెను. అర్థవార్తాశాస్త్రములు, శుక్రనీతి, కామందకనీతి సర్వమును మయూరునిప్రక్క గుఱ్ఱముపై బోవుచు కుబ్జుఁ డతనికి బోధించెను. కుబ్జుఁడు మయూరుని శౌర్యపరాక్రమములు వందలైన పద్యములుగా వ్రాసెను. ఆపద్యములు

కుబ్జుఁడు నిత్యమును బాడుచునే యుండును. అతఁడు పాడఁగా వినిన వేలమంది శాతవాహనరాష్ట్రప్రజలు, వారినుండి మఱియు వేలమందియు మయూరుని శౌర్యగీతములు పాడుచుందురు. ఈకుబ్జుఁడు కాదంబుఁడైన మయూరునకు మహామంత్రి, సేనాపతి, ఆస్థానకవి, పరమమిత్రము. అదియునుగాక నేఁడు మయూరునకు భగవంతుఁ డన్నభావ మేర్పడినప్పుడు మంత్రోపదేష్టయై యాచార్యుఁ డయ్యెను. అదివఱ కెప్పుడు మయూరుఁడు కుబ్జునితోఁ బరిహాస మాడెడువాఁడు. నాఁటినుండి మానివేసెను.

## త్రయోదశాధ్యాయము

మయూరుఁడు గురూపదేశమును బొంది పునశ్చరణ లెక్క రెండుదినములు చేసెను. ఇంతలో మోకరిదుర్గమునుండి యతనికి వార్త వచ్చెను. భల్లాతవర్మ యేనుగులను, బదాతిసైన్యమును మోకరి, సైయందక, పునాతనదుర్గముల ముట్టడికి నిలిపి, యశ్వసైన్యమును శాతవాహనరాష్ట్రగ్రామటికాధ్వంసనము కొఱకుఁ బంపించుచుండె నని తెలిసెను. భల్లాతవర్మయుద్ధనీతిలో నిది యొకభాగము. ఒకవైపున దుర్గములను ముట్టడించును. మఱియొకవైపునఁ బల్లెటూళ్ళను దోచును. తగులఁబెట్టును. దీనివలన రెండులాభములు లున్నవి. ఒకటి తనసైన్యమున కాహారపదార్థము, సైన్యవ్యయమునకుఁ గావలసిన ధనము సమకూర్చుట. రెండవది శత్రురాజుహృదయములో భయము కలిగించుట. ఈరీతిగా నెన్నిదినములైనను జక్రవర్తినుండి సాయము లేకయే యుద్ధము చేయుచుండును. మయూరుఁడు భల్లాతవర్మయొక్క యీనీతి నూహించెను. తా నన్నివైపుల నుండియుఁ గట్టుదిట్టములు చేసెను. ఈయశ్వసైన్యము శాతవాహనరాష్ట్రమున జొఱఁబడవలయు ననఁగా వాయవ్యదిశయే

వీలు. ఈవాయవ్యదిశకు రెండుయోజనములమేఱ నొక పెద్ద వెలఁగతోఁట కలదు. ఈవెలఁగతోఁట సర్వసైన్యముల యొక్క రాకపోకలయందు విశ్రమస్థానము. ఆకాలము వెలఁగ పండ్లు పండి తోఁటయంతయు గుమ్మ్మని ఘ్రాణతర్పణముగా నుండును.

కడచిన మూఁడునెలలనుండి మయూరుఁ డాతోఁటలో నేదియో యొకపెద్దప్రయత్నము చేయుచుండెను. ఆతోఁటలో నదివఱకుఁ గోతులు లేవు. కొన్నివేల వానరములను మహాటవులలోనుండి పట్టించి తెప్పించి యావెలఁగతోఁటలోఁ బ్రవేశపెట్టించెను. అవి నాల్గురోజు లుండి లేచిపోయెను. ఇట్లు నాల్గైదు సారులు జరిగెను. ఆగోలాంగూలసమూహమును గపిత్థవననివాసముగాఁ జేయుట కతఁడు చాలపాట్లు పడెను. చివర కతని కొక యూహ తోఁచెను. పదిదినములలో నచట నొకచిన్నదియుఁ బెద్దదియుఁ గాని దేవాలయము నిర్మించెను. దినదినము పెద్ద గుండిగతో నన్నము వండించి సరిగాఁ బగలు రెండుజాములవేళ నాయన్నము స్వామికి నైవేద్య మైనతర్వాత నీశాఖామృగములకుఁ బెట్టించును. ఒకనెలదినములలో వేయివానరములు వెలఁగతోఁటను స్థావరము చేసికొనెను. వానరజాతి చాల చిత్రమైన జాతి. అవి మనుజునివలె మాటాడనేరవు. కాని, మనుజున కెంత వివేక మున్నదో యంతయు వాని కున్నది. ఒకపదినేను దినము లైనతరువాత నీవేయివానరములలో నొకపెద్దకలవరము కలిగెను. మొదటిదినములలో నీగుండిగెఁడన్నము నర్చకుఁడు తెచ్చి ధ్వజస్తంభముకడఁ గుంభముగాఁ బోయును.

వచ్చినవానరములన్నియు వానివానిచేతి కందినట్లుగా నన్నపు ముద్దల నెత్తికొనిపోవును. ఒకదినమున నొక పెద్ద కొండ ముచ్చు సర్వవానరముల నడ్డగించెను. వేయికోతులును గిచ కిచలాడి, పండ్లికిలించి, పెద్దయల్లరి చేసెను. ఈ కొండముచ్చు పక్షము మిగిలిన కొండముచ్చు లవలంబించెను. చిన్నకోతు లకు నైవేద్యములో భాగము లేకపోయెను. నాల్గవదినమునఁ గొండముచ్చునాజ్ఞ నిరాదరించి యొకసామాన్యవానరము కుంభ రాశిమీఁదఁ బడి యన్నము తీసికొని తినెను. ఈ పెద్దకొండ ముచ్చు దానిని జంపెను. కొండముచ్చులకు, వానరములకు దానితోఁ బెద్దయుద్ధము సమారంభమయ్యెను. వారము దినములు వానర మొక్కఁడైనను దేవాలయములోనికి రాలేదు. ఈ వారము దినములు నెక్కడఁ జూచినను జచ్చిపడియున్న వాన రముల శవములే గోచరించెను. ఇన్ని వానరములు చచ్చి పోవుచున్నందులకు మయూరునకు మిక్కిలి దుఃఖము వేసెను. మయూరుఁ డీవానరముల నెందుకుఁ దెచ్చెనో, యీ దేవాలయ మెందుకుఁ గట్టెనో, యెవ్వరికిని దెలియదు. కుబ్జుఁడుమాత్రము పరిహాసముగా 'మయూరుఁడు సుగ్రీవుని యవతారము. అతఁడు నొకపెద్దవానరము. అందుచేతఁ దనకులమైన వానరములను దీసికొనివచ్చి పెంచుచుండె' ననెను. మయూరుఁడు ప్రయోజన రహితముగా నిట్టిపని చేసెడివాఁడు కాఁడని సర్వజనులకుఁ దెలియును. కాని దీని యర్థమేమియో తెలియలేదు. ఇంత ధన మీవానరములమీఁద నెందులకు వ్యయపెట్టుచుండెనో ?

తరువాతఁ బదిదినములకుఁ జావఁగా మిగిలిన సర్వవాన రములు దేవాలయములోనికి వచ్చెను. కుంభరాశిని నాఁడొక వృద్ధవానరము సమీపించి తక్కిన వానరములకుఁ గొండ ప్రముచ్చులకుఁ దాను భాగములు చేసి పంచిపెట్టెను. చివరకు



సామాన్యవానరములే గెలిచెనని యంద అనుకొనిరి. కాని, పదు నేనుదినము లైనతరువాత నన్నరాశికడకుఁ జిన్నవానరము బదులు కొండప్రముచ్చు పోయి యన్నింటికిఁ బంచిపెట్టెను. అది పదునేనుదినములు జరిగెను. మయూరున కీవార్త యంతయుఁ దెలిసెను. అతఁడు నాశ్చర్యపోయెను. ఈవానరజాతిలోనున్న వివేకము వాని కద్భుతభావము కలిగించెను. ఈ వానరములను దెచ్చుట కిదియే ప్రయోజనమా యనిపించుచుండెను.

వానరములు వచ్చినప్పటినుండి మయూరుని సైనికు లలోఁ గొందఱకు నొక సముత్సాహము కలిగినట్లు తోఁచెను. ఒకదినమున నిద్దఱు సైనికులు వెలఁగతోఁటలోనుండి పోవుచు నొకఁ డిట్లనియెను. 'కోతులు గుఱ్ఱములమీఁద నెక్కి స్వారి చేయఁగలవా?' యని. వారిద్దఱు వానరములను గుఱ్ఱములమీఁద స్వారి చేయించుటకు నాటిమధ్యాహ్నము రెండుజాములనుండి

ప్రొద్దు కుర్చింకువఱకుఁ బ్రయత్నించిరి. ఏవానరమును బట్టుపడ లేదు. బలవంతముగాఁ బట్టుకోబడిన వానరములు వారిని గిచ్చి రక్కి నెత్తురుకండలు చూచెను. మయూరుని సైన్యములో నిది యొకక్రీడ యయ్యెను. దినదిన మెవరో నలుగురు సైనికులు వత్తురు. బహుప్రయత్నములు చేయుదురు. ఆవానరము లా గుజ్జములమీఁద నెక్కవు. ఒకవేళ బలవంతముగా వానరము లను దెచ్చినచో గుజ్జములు పారిపోవును. ఒకనెలనాళ్ళకు వాన రములు కొంత సాధు వయ్యెను. ఆశ్వికులను బూర్వమంత పట్టి పీకుటలేదు.

ఈరీతిగాఁ గొందఱాశ్వికులు దినదినముఁ గపిత్థవనమున నిట్లు చేయుచున్నా రనియు వానరములు సైనికులను గుజ్జములను గఱచుచున్న వనియు, గాయములు కుదురుట కష్టముగా నున్న దనియు మయూరునకుఁ దెలియవచ్చెను. మయూరుఁ డా సైని కులను బిలిపించి కోపబడెను. వారు మయూరునియం దెంత భక్తులో, యెంత భయస్థులో యంత చనువును గలవారు. 'ఎందుకోయీ ! మీ రింతపిచ్చిగాఁ బ్రవర్తించుచుండి' రని మయూరుఁడు వారి నడిగెను. వా రుత్సాహజన్య మీకార్య మని చెప్పిరి. ఎంత సేనాపతియైనను, నెంత మహాయుద్ధ నీతి విశారదుఁ డైనను నెంత శాత్రవహృదయభయం కరుఁడైనను మయూరునియందుఁ జిన్నతనము పోయినట్లు కనిపించలేదు. తానుగూడఁ బోయి యాప్రయత్నము చేయుదు ననెను. వృద్ధులైన సేనాపతులు 'మహా సేనాపతీ ! నీ కిది తగ' దని చెప్పిరి. అతఁడు నవ్వి యూరకుండెను. మఱునాఁడు

వానరములచేత నొడళ్లు రక్షించుకొన్న కొందఱు సైనికులను రహస్యముగాఁ బిలచి తక్కిన యెవ్వరికిఁ దెలియకుండ వారి వెంట నాకపిత్థవనమునకుఁ బోయెను. నలుగురుసైనికులను మాత్రమే వెంటఁ దీసికొనిపోయెను. ఆనలుగురు నించుమించుగ మయూరునకు సవయస్కులు. వారును మయూరుఁడు తమ కిచ్చు చనవునకు మిక్కిలి సంతసించిరి. వెలఁగ తోఁటలో వారు చాల ప్రయత్నము చేసిరి. చివరకు నేమియు ఫలవంతము కాలేదు. అప్పుడు మయూరుఁడు వారినలుగురను దూరముగా నిలుచుండుఁ డని చెప్పెను. తనగుఱ్ఱము నొకవెలఁగచెట్టుక్రింద నిలఁబెట్టెను. తా నావెలఁగచెట్టు నెక్కెను. చెట్టుపైకొమ్మనుండి పదివానరములు చూచుచుండఁగ గుఱ్ఱమువీపుపైకి దూకెను. గుఱ్ఱ ముడాయించెను. మయూరుఁ డాసమయమున దక్కిన నలుగురు సైనికుల గుఱ్ఱములను వెలఁగచెట్లక్రింద నిలఁబెట్టించెను. మయూరుఁడు కొమ్మమీఁదినుండి గుఱ్ఱముమీఁదికి లంఘించుట వానరములు చూచెను. వెంటనే నాల్గువానరములు నాల్గుగుఱ్ఱ ములమీఁదికి లంఘించెను. గుఱ్ఱములు పరుగెత్తెను.

మఱునాఁటినుండి పది, పాతిక, యేఁబది, వందగుఱ్ఱము లతో శాతవాహనరాష్ట్రాశ్వికదళము వెలఁగతోఁటలోనికి వచ్చును. అందఱును వెలఁగకొమ్మ లెక్కి గుఱ్ఱములమీఁదికి దూకుదురు. మఱల గుఱ్ఱములు దిగి తాము చెట్లక్రింద విశ్రమింతురు. పదినిముసములలో వందకోఁతు లాగుఱ్ఱములమీఁద నుండును. నెలదినములలో మయూరుని వేయిగుఱ్ఱములకు, వేయిమంది యాశ్వికదళమునకు నిది యొకక్రీడ యయ్యెను.

ఈక్రీడ మయూరున కంగీకారమైనట్లు కన్పించెను. ఆవానరములకుఁ జెట్టుక్రింద గుఱ్ఱము కన్పించినచోఁ జాలును. వాని మీఁద నెక్కి స్వారి చేయుట వాని కలవాటైపోయెను.

భల్లాతవర్మసైన్యము పదిదినములకు వచ్చి చేరు ననఁగా మయూరుని యాశ్వికదళము తాము వచ్చి యిట్లు క్రీడించుటకు వీలు లేకపోయెను. చక్రవర్తి యాశ్వికదళము తమపల్లెలమీఁదఁ బడవచ్చుచున్నది. వారి నెదుర్కొనవలసిన సన్నాహముమీఁద నుండిరి.

భల్లాతవర్మ తనయశ్వసేన శాతవాహనరాష్ట్రములో నేదిశనుండి ప్రవేశింపవచ్చునో చారులను బంపి కనుగొనెను. తక్కినసర్వదిశలు సురక్షితములై యుండెను. ఒక్కవాయవ్య దిశయే గుఱ్ఱములదాడి కనుకూలముగా నుండె నని వానికి వార్త తెలిసెను. గజపదాతిదళములు మోకరిదుర్గమును జుట్టుముట్టెను. గుఱ్ఱపుదళమును భల్లాతవర్మ వాయవ్యదిశగాఁ బంపించెను. తనక్రిందసేనానికి మోకరిదుర్గపు ముట్టడి నప్పగించి తానుగూడ నశ్వసైన్యముతో బయలుదేరెను. ఈ సైన్యమునకుఁ బల్లవేంద్ర నగరము వదలిపెట్టినప్పటినుండియు విశ్రాంతి లేదు. అది పదునేనువందల యాశ్వికదళము. వా రావెలఁగఁతోటకుఁ జేరినంతనే యచట విశ్రమింత మనిరి. భల్లాతవర్మ యాతోఁట యెఱుఁగును. తత్పూర్వ మాసమీపమున దేవాలయము లేదు. అందందుఁ జెట్ల మీఁదఁ గొన్ని వానరములు కన్పించెను. భల్లాతవర్మ వానిని గూర్చి విచారించలేదు. అందఱాశ్వికులును గుఱ్ఱములును జెట్లకుఁ గట్టివేసి, తాము తెచ్చుకొన్న యాహారములను దిని, మంచితీర్థము

త్రాగి, గుంపులుగుంపులుగాఁ జేరి యేదో మాటాడుకొనుచుండిరి. వందమంది యాశ్వికులుమాత్రము రక్షణగా శాతవాహన రాష్ట్రదిశయందు గుఱ్ఱములమీఁద నెక్కి నిలుచుండిరి.

ఎక్కడెక్కడనుండియో క్రమముగా వేయి వానరములు వెలఁగచెట్లమీఁదికి వచ్చెను. కొంత సేపటికి హఠాత్తుగా నొక్కసారి వేయివానరములు వేయిగుఱ్ఱములమీఁదికి దూకెను. గుఱ్ఱములన్నియు బెదరి, కట్టుత్రాళ్లు త్రెంచుకొని యెగఁబడెను. ఆవానరములు సుశిక్షితాశ్వికులవలెఁ గళ్ళెములు చేఁబూని, గుఱ్ఱములను వానియభేచ్ఛముగాఁ బోనీయకుండ నాగ్నేయ



దిశాభాగముగాఁ బరువు లెత్తించెను. భల్లాతవర్మ సైన్యమున కిది మొట్టమొదట నొకపరిహాసముగాఁ గనిపించెను. తరువాతఁ గ్రీడగా భాసించెను. వేయిగుఱ్ఱములు కనుచూపుమేఱ దాటిపోయినతరువాత భయము వేసెను. అట్లు పోయిన వానిలో భల్లాతవర్మ గుఱ్ఱముకూడ నుండెను. గడియ గడియన్నరవఱకు భల్లాతవర్మకుఁగాని, యితరసైన్యమునకుఁ గాని యేమియుఁ దోఁచలేదు. అన్నిగుఱ్ఱములు నాగ్నేయ దిశకే యేల పోవలయును? మయూరునిసైన్యము వారిగుఱ్ఱముల కాశిక్షణ యిచ్చెను. వానరముల కాదిశగాఁ బోవుట యలవా టయ్యెను. అందుచేత నన్నివానరములు నాదిశగానే

గుబ్బములను దోలెను. భల్లాతవర్మ సైన్యమునకు వారు పడ్డ యాశ్చర్యము తీరువఱకే రెండుగడియ లయ్యెను. అప్పు డేమి చేయవలయు నన్న నేమి చేయవలయు నను ప్రశ్న పుట్టెను. అందఱకును నొక్క-రహస్యము తెలిసెను. ఇదియంతయు మయూరుని పన్నుగడ. ఈరీతిగా వానరములను శిక్షించిన మయూరుని ప్రతిభ కందఱు నాశ్చర్యపోయిరి. అతఁ డన్నచో నందఱకు గుండెలలో దిగు అయ్యెను. తక్కి-న యైదువందల గుబ్బములతో వానిని వెన్నాడుద మని కొందఱనిరి. కొందఱట్లు చేయఁగూడ దనిరి. ఆ గుబ్బము లిదివఱకే మయూరుని సైన్యము నకు వశమై యుండును. అయిదు వందల గుబ్బములతో మనము వేయి గుబ్బములమీఁదికిఁ బోవుట, మనము వారికత్తుల కెఱ యగుట యనిరి. భల్లాతవర్మ చివరకు విచారించి యేఁబది మంది యాశ్వికుల నాగుబ్బములు పోయిన జాడఁ దెలిసికొని రమ్మని పంపించెను. ఆయేఁబదిమందియాశ్వికులు రెండామడ పోయిరి. చాలదూరముగా వారి కీవేయిగుబ్బములు కన్పించెను. ఆగుబ్బములు పాఱిపోవుటలేదు. అన్నిగుబ్బములమీఁద బల్లెము లతో నాశ్వికు లుండిరి. అది మహాపర్వత ప్రదేశము. ఆ యాశ్వికులు పర్వతోపరిభాగముల దూరదూరముగా నామార్గ మును రక్షించుచుండిరి. ఈవేయివానరములు నాశ్వికులకు సమీపమునందే యుండెను. ఈకోఁతు లాగుబ్బములను దీసి కొనిపోయి వారి కప్పగించెనా ? ఎన్నిసంవత్సరము లీకోఁతు లీశిక్షణము పొందెను. ఎంతకాలమైనను మయూరుఁ డేడాదికిఁ బూర్వము రాజే కాఁడు. వారి కాశ్చర్యము వేసెను. భయము

వేసెను. తా మేఁబదిమందియు వారిమీఁదికిఁ బోవుటకన్న తెలివి తక్కువ లేదు. వెంటనే గుఱ్ఱములను మఱలించి భల్లాతవర్మ కడకుఁ బోయిరి. సంగతియంతయుఁ జెప్పిరి.

భల్లాతవర్మ మూర్ఖుఁడు. మఱియొక్కఁ డైనచో, మిగిలిన యైదువందల యాశ్వికదళమును దీసికొని తిరిగిపోయియుండును. అతఁ డట్లు చేయలేదు. 'తనవద్ద దొంగిలింపఁబడిన వేయిగుఱ్ఱములు నాగ్నేయదిశయం దుండెను. వాయవ్యదిశయం దున్న శాతవాహనరాష్ట్రిపుఁ బల్లెటూళ్ళమీఁదఁ బడుటకు నైదువందల గుఱ్ఱములు చాలవా ?' అనియే యాలోచించెను. ఆవేయి గుఱ్ఱములు నిట్లు తిరిగివచ్చుటకుఁ జాలకాలము పట్టును. మోకరి దుర్గమునకు వార్తఁ బంపించెను. ఈయైదువందల గుఱ్ఱములకు సాయముగా నుండుటకు వందయేనుఁగులను దెప్పించి గ్రామటికలను గొల్లగొట్టుద మని యెంచెను. వారిలో బుద్ధిమంతులైన సైనికులు కొంద ఱి ట్లనిరి. 'మయూరునకు మనవేయిగుఱ్ఱములేనా ? ఆయనకు వేఱే యాశ్వికదళ ముండదా ? ఆయాశ్వికులెంత నేరుపరులైనచో నింతపనిఁ జేసియుందురు ? ఆశ్వికులు కాకుండ నింతపని చేయలేరు. ఆశ్వికులు లేకుండ మయూరుఁడుండఁడు. అతని సైన్యమంతయు గుప్తమై యుండును. ఎచ్చట నున్నదో మనము తెలిసికొనలేము. ఈవాయవ్యదిశ యరక్షితముగా నున్నట్లు కన్పింపఁజేసియుండును. అతనితో యుద్ధములో జాగ్రత్తగా నుండవలయును. అశ్వగజపదాతి సైన్యములు మూఁడును జీలఁదీసి యుంచరాదు. చీలఁదీసినచో నతఁడు వేయి విధములుగా మనలను సంహరించునట్లు కన్పించును. సేనా

పతులైన తమరు వెంటనే చక్రవర్తికి వార్త పెట్టి రెండువేల గుఱ్ఱములను దెప్పింపవలయును. లేనిచో మయూరుఁడు సాధ్యుఁడు కాఁ' డని చెప్పిరి. వారు చెప్పినమాటలలోని యాథార్థ్యము భల్లాతవర్మయొక్క హృదయ మంగీకరించెను. వాని మనస్సును, వానిగర్వమును, వానియభిమానమును దాని నంగీకరింపలేదు. ప్రథమకబళముననే మక్షికాపాత మన్నట్లు నేను తొలుతనే యీవార్త చక్రవర్తికిఁ బంపినచోఁ జక్రవర్తి నన్నుఁ బరిహాసమాడు నని యతఁ డనుకొనెను. చక్రవర్తికిఁ దన మీఁదనున్న యభిమానము పోవును. వేసిన యెత్తు లేదు. జరిగిన యుద్ధము లేదు. చక్రవర్తికి వృథాగాఁ దాను వేయిగుఱ్ఱములు నష్టపెట్టెను. భల్లాతవర్మ మిక్కిలి దురభిమాని. ఆ దురభిమానమునకుఁ దోడు, మయూరునిమీఁదఁ బగ విచిత్రముగా నుండెను. ఏమైనను సరే, మఱలఁ జక్రవర్తిని సైన్యము పంపింపు మని, ధనము పంపింపు మని యడుగకుండఁ దాను దెచ్చిన సైన్యములో మయూరుని సాధించికాని యింటికిఁ బోఁడు. భల్లాతవర్మవద్దఁ గోటిదీనారము లుండెను. వానితో మఱల దాను వేయిగుఱ్ఱములు కొనును. కొనుటకు వేయిగుఱ్ఱము లెక్కడ దొరకునో భల్లాతవర్మకుఁ దెలియును.

## చతుర్దశాధ్యాయము

భల్లాతవర్మ తన డబ్బుతోఁ బదునేనువందల గుఱ్ఱములను గొనెను. తనసర్వస్వమైన యాస్తియుఁ దాకట్టు పెట్టి, మఱి నాల్గు వందల యేన్గులను దెచ్చెను. ఇతరరాష్ట్రములనుండి నెలజీతము లకు సైన్యములను దెచ్చెను. ఒక్క నెలదినములలో రెండువేల గుఱ్ఱములు, వేయి యేనుఁగులు, నిఱువదివేల సైన్యమును జేసెను. అతఁడు తాఁకినంతనే మోకరిదుర్గము విచ్చిపోయెను. మోకరిదుర్గములో లెక్కకు వందమంది సైనికులు లేరు. భల్లాత వర్మ యాశ్చర్యపోయెను. వందమంది సైనికులు రక్షించుచున్న దుర్గమును దాను నెలనాళ్లు ముట్టడించి కాని లొంగఁదీయలేక పోయెను. ఈ మయూరశర్మ దుర్గరక్షణోపాయములు వాని కాశ్చర్యము గొలిపెను. అతఁడు నిశ్చయించుకొనెను. అతఁడు నెమ్మదిమీఁద జాగ్రత్తగా మయూరు నోడించ వలయునుగాని తొందరపడి చేసినచోఁ దాను దెబ్బ తినును.

ఈవానరములు వేయిగుఱ్ఱములను దొంగిలించుట పల్లవ చక్రవర్తి వినెను. ఆనాఁ డాయన నవ్వినంత నవ్వు మఱి యేనాఁడును నవ్వలేదఁట! తరువాత భల్లాతవర్మ గుఱ్ఱములను

గొనుట, యేనుఁగులను గొనుటకూడఁ జక్రవర్తికిఁ దెలిసెను. చక్రవర్తి యొకవిధముగాఁ దృప్తి పొందెను. చక్రవర్తులును, రాజులును వారొకవిచిత్రమైన పురుషులు. మంత్రులు, సేనానులు, తదితరోద్యోగులు రాజు సొమ్ముఁదినుచుందురు. రాజున కా సంగతి తెలియును. 'తిననీలే' యని యూరకుందురు. భల్లాత వర్మవద్ద కోటిదీనారము లుండుటయు, నతఁ డనేకగ్రామముల ప్రభు వగుటయుఁ జక్రవర్తికిఁ దెలియును. తెలిసియు నూర కుండెను. ఈసొమ్మంతయుఁ జక్రవర్తినుండి హరించిన దనియుఁ జక్రవర్తికిఁ దెలియును. ఇప్పు డాధనమంతయు మయూరశర్మను గెలుచుటకోసము భల్లాతుఁడు వ్యయపెట్టినాఁ డనుట చక్రవర్తి కొకతృప్తిహేతు వయ్యెను. రెండవది చక్రవర్తికి మయూరుని మీఁద నభిమాన మెక్కు వయ్యెను. చక్రవర్తికి మయూరుని మీఁద నభిమానము పెరిగినకొలఁది భల్లాతవర్మమీఁద నభి మానము తఱుగుచుండెను.

భల్లాతవర్మ క్రొత్తసైన్యమును దెచ్చెను. క్రొత్తగుఱ్ఱము లను గొనెను. వేలే యేన్గులను దెచ్చె నని మయూరునకుఁ దెలిసినప్పటినుండి మయూరుఁడు భల్లాతవర్మనుగూర్చి జాగ్రత్త పడఁజొచ్చెను. పూర్వమువలెఁ జిన్నియెత్తు లెత్తి వీనిని గెలు చుటకు వీలు లేదు. భల్లాతవర్మ తనసైన్యమును జీలఁదీయుట లేదు. త్రికూటము మొదలైన తాను మున్ను గెలిచిన దుర్గముల నన్నిటిని భల్లాతవర్మ యొకదానివెనుక నొకదానిని ముట్టడించు చుండెను. రెండునెలలలో నాలుఁగుదుర్గములను వశము చేసి కొనెను. మయూరశర్మ రహస్యము భల్లాతవర్మ తెలిసికొనెను.

ఏదుర్గములోనను వందమంది సైనికులకంటె నెక్కువ లేరు. కోటకు లగ్గ లెత్తి నిచ్చెనలు వేసి నాల్గువైపులనుండి వందలాది సైన్యముల నెగఁబ్రాకించును. కోటతలుపు లేనుఁగులతో, దూల ములతోఁ గుమ్మించును. ఒక్కచోటఁ గోటగోడ బీటిచ్చిన తరువాత భల్లాతవర్మసైన్యము యథేచ్ఛముగా లోనికిఁ బోఁ జొచ్చును. లోనున్న వందమందిసైనికులు నెంత తీవ్రముగాఁ బోరాడినను ప్రవాహములవలె వచ్చు శత్రుసైన్యముల నెదుర్కొన లేక వందమందియు హతమారుచుండిరి. భల్లాతవర్మ నెల బత్తెపు సైనికులచేతనే కోటలు ముట్టడింపించుచుండెను. వారు చచ్చినమాత్రము తన కేమి? చక్రవర్తిసైన్యము చెక్కు చెదరుటలేదు. తాను గొన్న గుఱ్ఱములను, నేన్గులను కోటల ముట్టడుల కుపయోగించుటలేదు.

మయూరుఁడు తాను చేసిన ప్రయత్నమంతయు వ్యర్థమైన దనుకొనెను. కోటతరువాత కోటగా ముట్టడించినచోఁ దనకుఁ బెద్దయుద్ధము తప్పదు. పెద్దయుద్ధము చేసినచో జయాపజయములు దైవాధీనములు. భల్లాతవర్మకుఁ దాను గ్రొత్తగా గెలిచిన కోటలన్నిటిని మయూరుఁడు పట్టుకొనిచ్చెను. భల్లాతుఁడు గెలిచిన ప్రతికోటయందును గొంతసైన్య ముంచక తప్పకవచ్చెను. మయూరుఁ డాయన్నికోటలయందును దత్పూర్వమే రహస్యమార్గము లేర్పఱచియుంచెను. ఆమార్గముల ద్వారా తా నెప్పుడు తలఁచుకొన్నచో నప్పుడే యా కోటల నాక్రమించగలఁడు. కాని తా నట్లు చేయలేదు. ఎప్పుడు చేయు ననఁగా భల్లాతవర్మసైన్య మేదోచోట దెబ్బ తినినతరువాతఁ

జేయును. త్రికూటముకూడ భల్లాతవర్మ గెలిచినచో నప్పుడుగాని శాతవాహనరాష్ట్రముమీఁదికి రాఁడు. శాతవాహనరాష్ట్రముమీఁదికి రాకముందు భల్లాతవర్మకుఁ బెద్దదెబ్బ తగులవలయును. భల్లాతవర్మ తాను బట్టుకొన్న కోటలన్నియు సులభముగాఁ బట్టుకొనెను. నెలబత్తెపు సైనికులు నాల్గువేలమంది చనిపోయిరి. అసలు తనసైన్యమునకు భంగము లేదు. ఎప్పటికప్పుడు నెలబత్తెపు సైనికులు క్రొత్తవారు వచ్చుచుండిరి. ఈరెండునెలలలోఁ జక్రవర్తిసైన్యము పని లేకుండ నుండెను. భల్లాతవర్మ సైన్యమును జీల్చుటలేదు.

మయూరశర్మ త్రికూటములో రెండువేలసైన్యమును బెట్టెను. భల్లాతవర్మ త్రికూటములోఁగూడ వందమంది సైనికులే యుండె ననుకొనెను. సైనికులు ముట్టడించిరి. మున్నెఱుఁగని విచిత్రమారణము భల్లాతుని సైనికులు పొందిరి. త్రికూటముయొక్క పరిసరములలో మిక్కిలి దగ్గఱగాఁ జిన్నచిన్న గుట్ట లుండెను. అవియన్నియు మయూరుని సైనికశిబిరములు. మయూరుని యాశ్వికులు తత్పర్వతములమీఁదనుండి వందవందమందిగా విడిసియున్న చక్రవర్తిసైన్యముమీఁదఁ జిన్నచిన్న దాడు లారంభించిరి. వారు పదాతులమీఁదికి వచ్చి దూఁకుదురు. వందమందిని, రెండువందలమందిని జంపి వారిదారిని వారు పోవుదురు. త్రికూటపుముట్టడిలో భల్లాతవర్మ కీచిట్టిదాడుల యెద్దడి యెక్కు వయ్యెను. పదిదినములలోఁ జక్రవర్తిసైన్యము రెండుమూఁడువేలు నశించెను. త్రికూటము సాధ్యము కాలేదు. త్రికూటదుర్గాంతర్భాగమునఁ గొన్నివేలమంది సైనికులున్నారని

భల్లాతవర్మకుఁ దెలిసెను. ఏనిముసమునందును దానప్రమత్తుఁడై యుండుటకు వీలు లేదు. రాత్రులందును నిదురపోవుటకు వీలు లేదు. ఈ గుఱ్ఱపు దాడులు రాత్రులం దెక్కువయ్యెను. పదునేను దినములు గడచునప్పటికిఁ బూర్వము సుఖముగానున్న చక్రవర్తి సైన్యము డస్సిపోయెను. గుఱ్ఱము మీఁదినుండి మానిసి దిగుటకు వీలు లేదు. ఏనుగుమీఁదనుండి హౌదా దించుటకు వీలు లేదు. సరిగాఁ గోటముట్టడి వేయుటకు వీలు లేదు. ఏదో యొకచోటఁ గోటగోడ నెక్కుటకు వీలైనచో నచ్చటికే వెనుకనుండి మయూరునియాశ్వికదళము వచ్చును. త్రికోటపు ముట్టడి రెండు నెలలు జరిగెను. కోట చెక్కు చెదరలేదు. భల్లాతవర్మ పదునేను దినములైనతరువాతఁ జుట్టుపట్లనున్న చిన్నచిన్న గుట్టలు తనయధీనములో నున్నగాని, యీయెద్దడి వాయదని యాగుట్ట లన్నిటిని దాను వశపఱచుకొనెను. దానితో మయూరుని సేనల యెద్దడి తగ్గెను. ముట్టడి సాగ నారంభించెను. రెండునెలల తరువాతఁగూడ ముట్టడి ఫలవంతము కాలేదు. ఒకనాఁటి ప్రొద్దున భల్లాతవర్మసైనికులకుఁ ద్రికూటదుర్గములో సైన్యమున్నట్లు కనిపించలేదు. కొంతసేపటికిఁ గోఁటతలుపులు భేదించి భల్లాతుని సైనికులు లోనికిఁ బోయిరి. లోపల నొక్క పిట్ట లేదు. ఆహార పదార్థము లేదు. వట్టి కోట యుండెను. ఇన్ని వేలమంది సైనికులు నెట్లు పోయిరి? కోటలో నొకరహస్యమార్గ ముండెను. ఆ మార్గమునుండి సర్వసైనికులు వెడలిపోయిరి. ఆమార్గము వెంటఁ బోఁగా నొకయోజనముదూరమున నామార్గద్వారము మహాసేనల చేత నవరోధింపఁబడియుండెను. ఆమఱునాఁడు భల్లాతవర్మకు

వార్త వచ్చెను. తానిదివరకు గెలిచిన కోటలన్నియు మఱల మయూరశర్మ యధీనములోనికిఁ బోయె నని. అవి యెనిమిది కోటలు. ఆయెనిమిది దుర్గములందుఁ జక్రవర్తిసైన్య మైదు వే లుండెను. ఒక్కసైనికుఁడు మిగులలేదు. భల్లాతవర్మ యాలోచించెను. వెలికోటలు తా నెన్ని పట్టుకొన్నను నింతియే. ఈసర్వదుర్గములయందు రహస్యద్వారము లుండెనుగాబోలు. అర్ధరాత్రములందు శత్రుసైనికులు ప్రవేశింతురు. లోనిసైనికులను సులభముగా మడియింతురు. ఈవిచిత్రమైనయుద్ధము చేయుట యెట్లు? ఈకృత్రిముఁడైన మయూరుని గెల్చుట యెట్లు?

భల్లాతుఁడు మఱి దుర్గముల ముట్టడింపఁ దలఁచలేదు. సూటిగా శాతవాహనరాష్ట్రముమీఁదఁ బడును. వెంటనే ముందు గజసైన్యము, దాని కిరుపార్శ్వములయందు నశ్వ సైన్యము, వెనుకఁ బదాతిసైన్యముగా హగరీపెన్నానదుల నడుమ శాతవాహనరాష్ట్రముమీఁదఁ బడెను. పడినవెంటనే భల్లాతవర్మకుఁ దెలిసెను. పూర్వము తాను దోఁచికొనిన యూళ్లు కా వివి. ప్రతిగ్రామము చిన్నదుర్గమువలె నుండెను. ప్రతిగ్రామములోనను దన సైనికులు బలిపెట్టఁబడుచుండిరి. ప్రతిగ్రామము సర్వాయుధభరితమై యుండెను. గుఱ్ఱముమీఁది రౌతునకుఁ బూర్వ మెదురు లేదు. గ్రామములోని ప్రతిబాలుఁడు కత్తి చేఁబూని మునుగాళ్లు నఱకెడువాఁడే. ఒకఁడు గుఱ్ఱము మునుగాళ్లు నఱకును. మఱియొకఁడు రౌతు నెదిరించును. గ్రామములో గృహముమీఁదికిఁ బోయినచో నిండ్లన్నియుఁ దలుపులు వేసియుండును. తలుపులు పగులఁగొట్టినతరువాత లోన మనుష్య

లుండరు. వస్తుసంభారము లేవియు నుండవు. పదిమంది సైనికులు లోనఁ బ్రవేశించినంతనే యెచటఁ దాగియుందురో గ్రామస్థులు బైటనుండి వచ్చి లోనిసైనికుల సంహరింతురు. ఒక్కొకపుడు సైనికులు లోనికిఁ బోయినతరువాత బైటఁ దలుపులు వేసి గృహము తగులఁబెట్టుదురు. పదివేలసైన్య మొక్కయూరిమీఁదఁ బడఁజాలదుగదా? వేయిమంది యొక్కొక్కయూరికిఁ బోవచ్చును. ఏగ్రామమును రెండుమూఁడు వందలమందిని బలి పుచ్చుకొనకుండ వదలుటలేదు. అది కాక మఱియొక చిత్రము. ఈగ్రామములలోని స్త్రీశిశువృద్ధు లేమైరి? ధనధాన్యాదు లేమయ్యెను? పశువు లేమయ్యెను?

భల్లాతవర్మసేన చొఱఁబడు ప్రదేశమున మయూరుఁడు రెండువందల గ్రామములను స్త్రీశిశుబాలవృద్ధపశుధాన్య శూన్యముగాఁ జేసివేసెను. తనగజసైనికులను బ్రతిగ్రామమునందును బదిమందిని నిలిపెను.

భల్లాతవర్మసైన్యము పదిదినములలో నెనుబదిగ్రామములమీఁదఁ బడెను. అతనిగుఱ్ఱములు వేయి నశించిపోయెను. నాల్గువేలసైన్యము సంహరింపఁబడెను. అయిదువందల గజములు ఖండితశుండము లయ్యెను. వీ రెవ్వరో విచిత్ర మనుష్యులు. ఏనుఁగు కనఁబడినచోఁ జాలును. దానికి మొట్టమొదటఁ జేయఁబడెడు పని దానితొండము నఱకుట. తొండము నఱకఁబడినంతనే యాయేన్గులు ఘీంకారములు సలుపుచు స్వపరసైన్యవివక్ష లేక యథేచ్ఛముగాఁ బఱుఁగులు వాఱి పోయినంతమేఱ జనములను మర్దించుచుండెను. ఆగ్రామస్థులు విచిత్రముగా

దాఁగుకొనుచుండిరి. వారు ప్రత్యేకముగా దాఁగియుండు స్థలములు ప్రతిగ్రామమునందు రహస్యముగా నిర్మింపఁబడి యుండెను. ఇపుడు కనుపింతురు. ఇపుడు కనుపించరు.

పదిదినములైనతరువాత భల్లాతవర్మ కనులు తెఱచెను. తనయశ్వసైన్యము మిగిలిన దింత యని చెప్పుకొనుటకు వీలు లేదు. పదాతిసైన్యము నాల్గువేలు నిలువలేదు. ఏనుఁగులు సగానికి సగము చనిపోయెను. కనిపించని శత్రువులను నిర్జించుట యెట్లు? మఱి పదిదినములైనచోఁ దనసైన్యమేమి మిగులును? తానేమి చేయవలయును? కాదని వైజయంతిమీఁదికి దాడి వెడలినచో నచట నెన్నియిక్కట్టు లుండెనో? తనసైన్యమునకు నిలువ నీడలేదు. ఒకగ్రామ మాక్రమించితి మని యనుకొనుటకు వీలు లేదు. విశ్రమించుచున్న సైనికులను, నిదురపోవుచున్న సైనికులను, గ్రామస్థులు సంహరించుచుండిరి. ఒకగ్రామములో వేయిమంది సైన్యమున్నచో వారికిని భద్రతలేదు. ఈమయూరునిసైనికు లర్ధరాత్రమునందుఁగాని రారు. గుఱ్ఱములను దొంగిలింతురు. ఆయుధములను దొంగిలింతురు. వారు పాములవలె నడతురు. వందగజములదూరమున నున్న సైనికుని జీఁకటిలో గుఱితప్పకుండ సంహరింతురు.

ఒకనాఁడు భల్లాతవర్మవద్ద కొక బ్రాహ్మణుఁడు వచ్చెను. అతఁడు భల్లాతునితో ని ట్లనెను. 'నీకు నిజముగా మయూర శర్మమీఁదఁ గసి యున్నచో నే నతఁ డుండు రహస్యస్థలమును జెప్పెదను. నీవు కసి తీర్చుకొనుము. నాకు మయూరశర్మమీఁద మిక్కిలి కోపము. నా కతఁ డెక్కువ యపకారము చేసెను. అత

నిది స్థానాకోడూరు. అతఁ డెప్పుడో స్థానాకోడూరునకు వచ్చును. ఆ వచ్చినసమయము నీకుఁ జెప్పెదను. నీసర్వసైన్యముతో నా గ్రామమును ముట్టడించుము. వాఁడు నీ చేఁజిక్కును. ఇదియే నీకు సులువైనమార్గము. నీవు శాతవాహనరాష్ట్రమునఁ బ్రవేశించిన నీప్రదేశమున రెండువందల గ్రామములను నిఃస్త్రీశిశుబాలవృద్ధపశుధాన్యకముగా నతఁడు చేసెను. నీవు వానియూళ్లు దోఁచవలయు నన్నచో నీరెండువందలయూళ్లు వదలిపెట్టి పొమ్ము. తెల్లవారువఱకు శాతవాహనరాష్ట్రము నీదెసనుండి నిష్క్రమించి పదియోజనముల యెగువనున్న యూళ్ళమీఁదఁ బడుము. ఆపడుటయు మొగదలనున్న గ్రామములమీఁదఁ బడవద్దు. యోజనముమేర లోనికిఁబోయి యచ్చటి గ్రామములు ముట్టడించవలయును. ముట్టడించునపుడు ముందుచూపే కాదు, వెనుకచూపుకూడ నుండవలయును. నాలుగువందల సైన్యము గ్రామములోఁ బ్రవేశించినచో, మఱి నాలుగువందలమంది పై రక్షణ కుండవలయును. నీకుఁ జేతనైనచో నీయేనుగుల తొండములకు నినుపతొడుగు లుండవలయును. ఇనుపతొడుగులు వేసినచోఁ దొండములు కదలవు. కాని చేపపొలుసులవంటి కవచములు తొండములకు వేయవలయును. అవి యిప్పు డెచ్చటఁ జేయించెదవు ? అందుచే భద్రముగా నుండుము. నీకు గుర్తున్నదో లేదో, యేనుఁగుతొండమును నఱకెడువారు ప్రత్యేకముగా నుందురు. వారంద ఱెఱ్ఱతలపాఁగలు ధరించి యుందురు. అదే గుర్తు. వారి నేనుఁగులవద్దకు రానీయరాదు. వారు కనిపించినంతనే నీపదాతులు పోయి వారి నెదుర్కొనవలయును. నీ

సైన్యము నడచుచున్నదారిని నేను గుర్తు పెట్టుకొందును. ఏదిన మున మయూరుఁడు స్థానాకోడూరునఁ జేరునో యాదినమునకు రెన్నాళ్ళకుముందు నీకు వచ్చి చెప్పెద' ననెను. భల్లాతవర్మ కాబ్రాహ్మణుని సర్వవాక్యములు విశ్వసనీయము లయ్యెను. విశ్వసింపకుండ నుండుటకు వీలు లేకుండ నుండెను.

మఱునాఁడు భల్లాతవర్మ యాప్రాంతమును వదలి తన మిగిలిన సైన్యముతోఁ బోయెను. నాల్గుయోజనముల యెగువకుఁ బోయి, యచట యోజనము లోనికిఁ బోయి యాబ్రాహ్మణుఁడు చెప్పినట్లు చేసెను. ఎఱ్ఱతలపాఁగలవారి నేన్గులవద్దకు రానీయ లేదు. పది గ్రామములలో భల్లాతవర్మ తాను జేయఁదలఁచినట్లు చేసెను. కాని యచటి గ్రామస్థులును శూరులుగానే కనఁ బడిరి. స్త్రీలుకూడ యుద్ధము చేసిరి. తమ సైన్యముతో గ్రామస్థులు పోరాడిరి. ప్రతిగృహముఁ బట్టుకొనుటయు సులభ సాధ్యము కాలేదు. ప్రతి గ్రామమునందును సర్వాయుధము లుండెను. ప్రతి గ్రామస్థుఁడును ఖడ్గవిద్యానిపుణుఁడు. ప్రతి స్త్రీయు గోడచాటునుండి బల్లెము విసరగలదు. వీథిలో నాడు కొనుచుండు బాలురును సైనికులను లెక్కచేయరు. వడిసెలలో రాళ్ళు పెట్టి రువ్వుదురు. వారిని బట్టుకొనబోయినచో సాధ్యులు కారు. వీథులలోనున్న మహావృక్షముల శాఖలలో బాలురు కూర్చుండి పైనుండి కత్తులు విసరుదురు. రాళ్లు రువ్వుదురు. భల్లాతవర్మ సైనికులు వృక్షము లెక్కఁబోయినచో క్రింది గ్రామస్థులు వారి నెక్కుచుండఁగనే నఱకుదురు. ఏనుఁగులచేతఁ గొమ్మలను లాగించినచో నాబాలు రేనుఁగుల తొండములలోని

బెజ్జములలోఁ బొడుగైన యినుపసూదులు గ్రుచ్చుదురు. ఆ యేనుఁగులు కోపముకొలఁది మావటివాండ్రను గ్రిందికి లాగి పాదములతో మట్టించుటయుఁ గలదు.

ఇట్లు నాల్గుదినములు గడచెను. ఈనాల్గు దినములలోఁ గూడ భల్లాతవర్మ సైన్యము నష్టపడెను. కాని యచ్చటికన్న నిచ్చట మెఱుగు. ఆబ్రాహ్మణునివలన దోషము లేదు. ఎల్ల పాఁగల సైనికులను గజములవద్దకు రానీయరాదు. కాని వారి నడ్డగించరాదు. వారుడేగలవలె దూఁకుదురు; సింహములవలె సంహరింతురు.

# పంచదశాధ్యాయము

మొట్టమొదట భల్లాతవర్మ దాడియెత్తిన యూళ్ళకు స్థానాకోడూరు సమీపములో నుండెను. భల్లాతవర్మ కాసంగతి తెలియదు. అందుచేత మయూరుఁడు కుబ్జుని బంపించి భల్లాతుని దాడి యచటనుండి దూరముగాఁ బంపించెను. మయూరుఁడు పల్లవరాజున కెదురు తిరిగినప్పటినుండియు స్థానాకోడూరును దుర్గముగా మార్చుచునేయుండెను. ఇప్పటికి స్థానాకోడూరు పెద్ద జలదుర్గ మయ్యెను. ఈదుర్గముచుట్టు నేన్గులకుఁ బుక్కిలి బంటియైన ప్రవాహము ప్రవహించుచుండెను. ఏన్గులకు బుక్కిలిబంటి యగుట శత్రువుల కేమియు సహాయకారి కాదు. ఆయూరుచుట్టును బ్రవహించు నేఱు మిక్కిలి యూఁబి. జలము నిండుగాఁ బ్రవహించునప్పటికన్న నీరు తగ్గి ప్రవహించు నప్పుడే వాఁగు మిక్కిలి యపాయకరము. గుఱ్ఱము లేన్గు లూఁబిలోఁ గూరుకొనిపోవును. పదిదినాలకుఁ బూర్వమువఱకు సమృద్ధిగాఁ బ్రవహించుచున్న యా చెఱువునీటిని బ్రవాహము సగానికి సగ మడ్డగించిరి. పూర్వ మెగువనున్న చెఱువుకట్టఁ దెగగొట్టించి మయూరుఁడు జల మీవాఁగులోనికిఁ బెట్టించెను.

ఆతెగకొట్టిన చెఱువుకట్టకు రాతిగోడ గట్టించి, మయూరుఁడు ప్రవాహము నియమించెను.

ఒకదినమునఁ గుబ్జుఁడు మఱలఁ బోయి భల్లాతవర్మతోఁ బ్రసంగించి తరువాత మూన్నాళ్ళకు వచ్చుచున్న దశమి, సోమవారమునాఁడు రాత్రి పన్నెండుగంటలకు భల్లాతవర్మ స్థానాకోడూరుమీఁదికి వచ్చినచో మయూరుఁడు చిక్కునని చెప్పెను. భల్లాతవర్మ కుబ్జునిమాట ననుమానించలేదు. కుబ్జుఁడు నిజముగా శత్రుపక్షమువాఁడైనచో నెఱ్ఱపాఁగలవారు గజసైనికు లని చెప్పఁడు. అందుచేతఁ గుబ్జునియందు మంచి విశ్వాసము కుదిరెను.

దశమి సోమవారము వచ్చెను. ఆనాఁడురాత్రి పన్నెండుగంటలకు స్థానాకోడూరుముట్టడి ప్రారంభ మయ్యెను. ఇప్పటికి భల్లాతవర్మకు మిగిలినసైన్యము నాల్గువేలమంది పదాతులు, నాల్గువందల గజములు, అయిదువందల గుఱ్ఱములు. భల్లాతవర్మ తఱిగిపోయిన తనసైన్యముతో శాతవాహనరాష్ట్రము నంతయు జయించు నాశలు వదలిపెట్టెను. మయూరశర్మను బట్టుకొనుటయే నిజమైన యుపాయము. ఈ నాల్గువేలపదాతులు చక్రవర్తిసైన్యపరిశిష్టము. వీరు కాక నెలబత్తెపు సైనికులు రెండువేలమంది కలరు. ఆరెండువేలమందిని భల్లాతవర్మ ముట్టడికి వినియోగించెను. దుర్గము చిన్నది. క్రొత్తగా దుర్గకుడ్యము పర్వతశిలలతో నిర్మింపఁబడెను. దుర్గద్వారము కూడ మహాబలిష్ఠముగా నుండెను. అయినను, దుర్గద్వార మొకసారి భేదింపఁబడినతరువాతఁ బల్లవసైన్యము సులభముగా

లోనికిఁ బ్రవేశించవచ్చును. లోనున్న సైనికులకు ముట్టడి సంగతి తెలిసినట్లు లేదు. అర్ధరాత్రమునఁ జుట్టునున్న కందకమును దాటుటయే కష్టముగనుండెను. తెప్పలు వేసికొని కందకము మీఁదఁ బోవుటకుఁ గందకములో మోఁకాటిబంటినీరు లేదు. దుర్గద్వారమువైపున ద్వారముల కిటునటు నిఱువదిగజముల మేఱ మహాఖాతముగా నుండెను. అచ్చటఁ దెప్పలు వేయవచ్చును. అందుచేత భల్లాతవర్మ సైనికులను గుఱ్ఱములమీఁద, నేనుఁగులమీఁదఁ గందకము దాటుఁడని చెప్పెను. కందకములో దిగిన ప్రతిగుఱ్ఱము, ప్రతియేనుగును బదియడుగులు పోయి యూఁబిలో దిగఁబడెను. ఊఁబిలో దిగఁబడి తెమల్చుకొన్న పాదము మఱల దిగఁబడఁగా నేనుగులు సీదరించుకొని ఘీంకారములు చేసి కరాగ్రముల నీరములు పీల్చి తుంపురులుగా మింటి కెగయించు చుండెను. అంతలో మహాకోలాహలము ప్రారంభ మయ్యెను. ఒక్క నిముసములో కోటగోడలమీఁద వేయికాగడాల వెలుతురు కనిపించెను. నిద్రపోవుచున్న కోట యొకసారి మేలుకొన్న ట్లయ్యెను. తనరాక శత్రువుల కెట్లు తెలిసెను ? ఈబ్రాహ్మణుఁడు మయూరుని రహస్య చారుఁడా ? బ్రాహ్మణుఁడు పాఱిపోలేదు. భల్లాతవర్మ సమీపముననే యుండెను. బ్రాహ్మణుఁ డిట్లు చెప్పెను. 'ఓయి సేనానీ ! లోన నెక్కువ మంది సైన్యము లేదు. ఇది మయూరుని యాజ్ఞ. కోట ముట్టడి వేసినపుడు లోనుండి వేయికాగడాలు వెలిగింతురు. లోపల రెండు వందలకంటె నెక్కువ సైన్య ముండదు. నీసైనికులు గోటగోడ పైభాగమున కెగఁబ్రాకించుము. వారు లోని సైనికులను సంహ

రించి కోటతలుపులను దెఱతురు. సులభముగా లోనికిఁ బ్రవేశించ వచ్చును. నామాటలోని యథార్థ్యము చూడు' మనెను. భల్లాత వర్మ నెలబత్తెపు సైనికులను గోటమీఁది కెగఁబ్రాకఁ బురి కొల్పెను. ఆయూఁబిలోననే యేనుఁగులను, గుఱ్ఱములను దిగ వేసిరి. వానిమీఁదనుండి సైనికులు పోయి కోటకు నిచ్చెనలు వేసిరి. లోనుండి యెక్కువ ప్రతియుద్ధము చేయు సైనికులు కని పించలేదు. కోట కెగఁబ్రాకుచున్న సైనికులు కొన్నిచోట్ల లోని సైనికులచేత సంహరింపఁబడినను, దుర్గద్వారసమీపమున సైని కులు సులభముగాఁ గోటపై కెక్కిరి. లోనఁ బెద్దకోలాహలము జరుగుచుండెను.

అప్పటికి సూర్యోదయము కావచ్చెను. కోట తలుపు లొక్కసారిగాఁ దెఱువఁబడెను. కందకము మీఁద వంతెన లోనుండి జారవిడువఁబడెను. దుర్గద్వారమున కెదురుగా భల్లాత వర్మయుఁ గుఱ్ఱఁడును జెఱియొక యశ్వముపై నిలుచుండిరి. వారివెనుక సైన్య ముండెను. ఆవంతెన కొయ్యవంతెన. ఏనుఁ గులు నడిచినచో నిలువదు. పైగా నేనుఁగులు సగానికి సగము బురదలో దిగఁబడియుండెను. తలుపు తెఱచినంతనే భల్లాత వర్మయుఁ గుఱ్ఱఁడును వారివెనుకఁ గొంతసేనయుఁ గోటలోనికి జొచ్చుకొనిపోయిరి. కోటగోడల కెగఁబ్రాకి దుర్గద్వారము తెఱచిన సైనికులు బారులు తీర్చి వీరిని లోనికిఁ బోనిచ్చిరి. కోట లోనికి భల్లాతవర్మయుఁ గుఱ్ఱఁడును బదిపదేనుగజాలదూరము పోయిరి. ఇంతలో దుర్గద్వారమువద్దఁ బెద్దకోలాహలము జరిగెను. ద్వారోపరిభాగమునుండి కొన్నివందలమంది సైనికులు లోనికిఁ

ప్రవేశించుచున్న శత్రుసైన్యము మీఁదఁ బ్రాఁగుచున్న పదిబిందెలనూనె నొక్కసారిగాఁ గ్రుమ్మరించిరి. పైనుండి వంద శిలలు వంతెనమీఁద దొర్లింపఁబడెను. ముందుఁ దూఁగివచ్చు సైనికులు వెను కొదిగిరి. ఈమహాశిలాభిపాతమునకుఁ గొయ్యే వంతెన విఱిఁగిపోయెను. ఆనిముసములోననే దుర్గద్వారము మఱల మూయఁబడెను.

భల్లాతవర్మ వెంట వచ్చిన సైనికులు రెండువందలమంది. అందులో నిద్దఱు సేనాను లుండిరి. వీరందఱు వెనుదిరిగి కోట తలుపులు మూసిన సైనికుల నెదిరింపఁబోయిరి. వారు సింహములవలెఁ బోరాడఁజొచ్చిరి. భల్లాతవర్మవద్దనున్న కుబ్జుఁడు కూడ వారితోఁ బోరాడఁబోయెను. కుబ్జుఁడు వాఁరితోఁ బోరాడు చుండెనో, భల్లాతవర్మసైన్యముతోఁ బోరాడుచుండెనో తెలియదు. రెండుమూఁడు నిమేషములలో ద్వారమువద్దనున్న వంద మందిసైనికులు వేయిమంది యయిరి. భల్లాతవర్మతో నున్న రెండువందలమంది సైన్యము క్రమక్రమముగా క్షీణించుచుండెను. కోటగోడల కెగఁబ్రాకి తలుపులు తెఱచిన నెలబత్తెపు సైనికులు తన కెదురుగా యుద్ధముచేయుచున్నట్లు భల్లాతవర్మకుఁ దోఁచెను. అయ్యో! ఈసైనికులందఱు మయూరుని కొలువులోని వారా! వీరుకూడ మయూరుని సైన్యమేనా! నెలబత్తెపు సైనికులను గుదిర్చికొనుట యెంత యుద్ధనీతివ్యతిరేక విషయము.

ఈరెండుగడియలప్రొద్దెక్కువఱకు భల్లాతవర్మ రెండు వందల సైన్యములో నేఁబదిమంది మిగులలేదు. మఱికొంతసేపటికి వారందఱు నిరాయుధులు చేయఁబడిరి. భల్లాతవర్మ

యొక్కనగుఱ్ఱముశరీరమున వందగాయము లేర్పడెను. గుఱ్ఱము క్రిందఁ బడిపోయెను. భల్లాతవర్మచేతిలోని కత్తిపిడి మాత్రము మిగిలియుండెను. మయూరశర్మ సైనికులు తన్నెందుకు సంహరించిరో భల్లాతవర్మకుఁ దెలియలేదు. ఇంతలో దూరమునుండి యొకయాశ్వికుఁడు, వందమంది యితరాశ్వికులు కొలిచి రాఁగాఁ దనవద్దకు వచ్చెను. ఆయన సమీపమునకు వచ్చినంతనే భల్లాతవర్మ గ్రహించెను. అతఁడే మయూరశర్మ. భల్లాతుఁడు మయూరశర్మను జూచి రెండేళ్ళకుఁ బైగా నయినది. నాఁటి మయూరునకు, నేఁటి మయూరునకుఁ జాల భేద మున్నది. నాఁటిమయూరుని వదనమున మీసములు లేవు. అప్పు డతనికి నూనూఁగు మీసములు వచ్చుచుండెనో, వచ్చుచుండుటలేదో! నేఁటిమయూరుని మూతిమీఁదఁ గ్రొత్తగా రెక్కలు వచ్చిన పడుచుదనములోని తుమ్మెదలవలె మీసము లుండెను. ఆ మీసములు చివర సన్నగా మెలిపెట్టఁబడియుండెను. మయూరుఁ డుదయముననే లేచి, స్నానము చేసి, మొగమున విభూతి ధరియించి, నొసటఁ గుంకుమబొట్టు పెట్టుకొనెను. మయూరుఁడు సన్నగా నుక్కుతీఁగవలె నుండెను. పూర్వముకంటె మానిసి నల్లబడియుండెను. మొగ మెంత పలచగా నుండెనో, ఱొమ్మంత విశాలముగా నుండెను. దండలు, ముంజేతులు, మిక్కిలి బలసి కఠినములై యుండెను. నడుముమాత్రము మిక్కిలి సన్నముగా నుండుటచేతను, మొగము పలుచగా నుండుటచేతను మానిసి సన్ననివాఁ డనిపించుచుండెను.

మయూరుఁడు గుజ్జమును భల్లాతవర్మ కెదురుగా నిలిపెను. నిలిపి యి ట్లనెను. 'ఓయి సేనాపతీ! నీకు స్వాగతము, సుస్వాగతము. నీవు నాపితృదేవతల యతిథివి' యని ప్రక్కనున్న కుబ్జునివంక జూచి యి ట్లనెను. 'ఆచార్యా! నమస్కారము. మహాకవీ! నీకు నేను జీవితాంతము కృతజ్ఞుఁడను. సేనాపతి భల్లాతవర్మ మిక్కిలి బడలియుండెను. వారికిఁ దగిన బస చూపించి స్నానపానాదులు చేయించి, వారితో నాప్రార్థన మనవి చేయవలసినది. వారికి బయటనున్న తనసేన యింకను దనకు సహాయపడునన్న యూహ యుండునేమో, యా సంశయము నివారింపవలయు' నని వెడలిపోయెను.

కుబ్జుఁడును, దక్కినయాశ్వికులును ఖడ్గహస్తులై భల్లాతవర్మను దుర్గద్వారోపరిభాగమునకుఁ దీసికొనిపోయిరి. బయట మహాయుద్ధము జరుగుచుండెను. అసంఖ్యాకులైన శత్రుసైన్యము పల్లవసైన్యముమీఁదఁ బడి హతము చేయుచుండిరి.

---

## షోడశాధ్యాయము

మయూరశర్మకుఁ బందొమ్మిదియేండ్లు. భల్లాతవర్మకు నలుఁబదియైదేండ్లు. భల్లాతుఁడు మంచివయసులో నున్నాఁడు. వార్ధక్య మతనివంకఁ జూచుటలేదు. బహుయుద్ధముల నారితేఱిన వాఁడు. కడచినయేఁడాదిగా నిత్యయుద్ధపరిశ్రమకలవాఁడు. పల్లవ చక్రవర్తిసైన్యములో నతనికంటె ఖడ్గవిద్యానిపుణుఁడు లేఁడు. నిత్యవ్యాయామముచేతఁ గఠినీకృతమైన దేహయష్టికలవాఁడు. క్రూరుఁడు; అమితకోపి. మిన్ను మన్నుఁ దెలియకుండ శత్రువు మీఁదికి దూఁకి వానిని హతమార్చువాఁడు. మయూరుఁ డన్నచోఁ బట్టరానంత కోపము కలవాఁడు. మయూరుని గెలుచుటకోస మిఱువదియేండ్లు తాను సంపాదించిన ప్రతిచిల్లిగవ్వయు వ్యయ పెట్టినవాఁడు. సర్వముఁ గోలుపోయినవాఁడు. మయూరుని సంహ రించకుండఁ జక్రవర్తి మొగము చూడరానివాఁడు. ఆజాను బాహువు. ఏనుఁగంత శరీరము కలవాఁడు.

మయూరుఁడు బాలుఁడు. బ్రాహ్మణులచేతఁ బెంచ బడినవాఁడు. కుబ్జకవి వినిపించిన సంస్కృతసారస్వతమధుర భావములచేత నార్ద్రీమైన మనఃప్రవృత్తి కలవాఁడు. లఘు

శరీరుఁడు. నిజముగా భల్లాతవర్మమీఁదఁ బగ కలవాఁడు కాఁడు. తాను సరిగా నెఱుఁగని చిన్ననాఁడు తనతల్లిదండ్రు లితనిచేతఁ జంపఁబడి రని దానికిఁ బ్రతిక్రియఁ జేయుట యొకనీతి యన్న భావము కలవాఁడు. భల్లాతవర్మను సంహరించినచోఁగాని తన పట్టుదల నెగ్గదన్న తీవ్రత లేనివాఁడు. సహజముగా సాధువు. న్యాయముకొఱకుఁ బ్రాణములు తెగించెడివాఁడు. ఖడ్గవిద్యలో నంత ప్రకాస్తి సంపాదించినవాఁడు కాఁడు.

స్థానాకోడూరులో మయూరుని యింటివాకిటిముందు సుమారు వందగజముల చతురశ్రపరిమాణముగల స్థలములో నిద్దఱు గత్తియుద్ధము చేయుటకు సిద్ధమై యుండిరి. మయూరుని సేనానాయకులు, కుబ్జుఁడు తదితరసైనికులు చుట్టును మూఁగి యుండిరి. గరిడీప్రదేశమునకు మిక్కిలి దగ్గరగాఁ గడిమిచెట్టుం డెను. ఆకడిమిచెట్టీపదియేఁడులు పూఁచినదో, యాకు రాలి నదో, కొమ్మలు వేసినదో యెవ్వరికి దెలియదు. ఈనాఁ డా వృక్షమునకు సందిగ్ధపరిస్థితి యేర్పడెను. ఈపరిస్థితి మయూ రుఁడు చేతులారఁ గలిపించిపెట్టినది. చేతిలోఁజిక్కిన భల్లాతుని ముక్కలు ముక్కలుగా నఱుకవచ్చును. ఉరి తీయించవచ్చును. పరాభవించి పంపించవచ్చును. కోఱలు తీసిన యాసింహము మఱలఁ దన్నేమియుఁ చేయలేదు.

కాని మయూరుఁడు మహాన్యాయశీలి. చేతిలోఁ జిక్కిన శత్రువును జంపినచో, శిక్షించినచో నది పౌరుషము కాదు. వానిని జయించుట కాదు. అది వధ చేయుట యగును. ఆపనిని బౌరుషహీనుఁడు చేయును. దుర్నీతిపరుఁడుచేయును. అందుచేత

మయూరుఁడు తులాయుద్ధ మేర్పఱచెను. భల్లాతవర్మతోఁ దా నొక్కఁడు గత్తియుద్ధము చేయును.

ఇద్దఱును గత్తులు, డాళ్లుఁ బూని యెదురెదురు నిలచి గోదాలోనికి దిగిరి. మయూరుఁ డిట్లనెను. 'అయ్యా! సేనాపతీ! నామీఁద నీ కున్నంతకోపము నీమీఁద నాకు లేదు. ఉన్నంత కోప మనుటకన్న, నున్నకోపమువంటి కోప మనుట మంచిది. నాది న్యాయమైన కోపము. నీది దుష్టమైన కోపము. ఒకదుష్టుఁడు వేయిఘోరకార్యములు చేయును. వానిలో నొక్కటియే నెపమై వానిని భగవంతుఁడు శిక్షించును. భగవంతుఁడు తనశిక్షయుఁ దనఁయనుగ్రహమును లోకమునందలి వ్యక్తులద్వారా చూపించును. నీవు నాకు మిక్కిలి యపకారము చేసితివి. ఆయపకారము పారలౌకికము. ఐహికమైన గొప్పయుపకారము జరుగుటకు నీవు హేతుభూతుఁడవు. నీవు నాచిన్ననాఁడు నాతల్లిదండ్రుల నవమానపఱచి వధించనిచో, నే నొక సామాన్య కృషీవలుఁడనై యుండెడివాఁడను. నీదయవలన నిప్పు డే మైతిని? ఒక పెద్ద సేనాపతి నైతిని. యుద్ధనీతివిశారదుఁడ నైతిని. నామిత్రు లందఱు శాతవాహనరాష్ట్ర ప్రజ లందఱు నన్ను రాజును గమ్మను చున్నారు. ఇదియంతయు నీదయాఫలము. ఆదయ నీదుష్కార్య పరిణామమైన ఫలముకాని, నీహృదయగతమైన సద్గుణము కాదు. నీవు నన్ను పంహరించినచో నాసేనయంతయు, నా మంత్రు లందఱు, నారాష్ట్రమెల్లను నీది. ఇది తీసికొనిపోయి నీచక్రవర్తి కిమ్ము. న న్నింత నమ్మకముగాఁ గొలిచిన యీ సర్వరాష్ట్రమును, నిన్ను మఱల నంత నమ్మకముగాఁ గొలుచును. అ కట్టు

దిట్టములు చేసితి' నని మయూరుఁడు ఖడ్గమును జాఁచి తన సేనానులవంకఁ జూచెను. అందఱును దలలు వాంచి, యిష్టము లేనట్లు వచ్చి, యంగీకారసూచకముగా నా ఖడ్గమును స్పృశించి పోయిరి. కుబ్జుఁడు మాత్రము రాలేదు. మయూరుఁడు కుబ్జుని జూచి యిట్లనెను. 'బ్రాహ్మణోత్తమా! నీవు నామిత్రమవు. నాకీర్తిగానము చేసినవాఁడవు. నాప్రాణములు రక్షించినవాఁడవు. భల్లాతవర్మను నాచేతికిఁ జిక్కించిన వాఁడవు. నాకు మంత్రోపదేష్టవు. నీకు నాయాత్మమీఁద నుండవలసిన మమకారము నాశరీరముమీఁద నున్నది.'

కుబ్జుఁ డిట్లనెను. 'మహారాజ! నీకు సర్వశాస్త్రములు, సర్వనీతియు బోధించినది శాతవాహనరాష్ట్రమును దీసికొని పోయి యొకకసాయివానిచేతిలోఁ బెట్టుటకుఁ గాదు. ధారుణి నాదివరాహమువలె సధర్మముగా మోయుటకుఁ దగిన దివ్యశిక్షణ నీ కిచ్చితిని. నీవు దుర్దైవవశమున నేలకుఁ గానిచో, నేను గవిని, పదిదేశములు తిరిగెదను. భల్లాతుఁడు పగబట్టి యెట్లును సంహరించును. నేను భల్లాతుని సేవింతు నని బాస చేయను. ఈదేశమును వదలిపోయెద నని బాస చేసెద' నని కత్తి ముట్టుకొనెను. మఱల మయూరుఁడు భల్లాతవర్మతో నిట్లనెను. 'ఓయి సేనాపతీ! నీవు నన్ను సంహరించినచో, నేమి చేయవలయునో చెప్పితినిగదా! మనమిద్దఱము యుద్ధము చేయునప్పుడు నాసైనికులలో నొకఁడును నీపైకి వచ్చి నిన్నన్యాయముగా ముట్టడించరు. నేను నిన్ను సంహరించినచో నీవు నా

తల్లిదండ్రులకుఁ జేసిన ద్రోహమునకుఁ బ్రతిక్రియ చేసిన ట్లగును. నాతండ్రి కన్నులయెదుట, నాతాత కన్నులయెదుట నా తల్లిని, నాసోదరిని నీవు పఱచిన భంగము నేఁటితో నివారింపఁ బడును. ఇది నావాఁకిలి. ఈవాఁకిట నీవు నా తండ్రిని జుట్టు పట్టుకొని లాఁగి, పశువును సంహరించినట్లు సంహరించితివి. నేను ని న్నట్లే సంహరించెద' నని భల్లాతవర్మమీఁది కొక్క దూఁకు దూఁకెను. అపుడు మయూరుఁడే నిజముగా నిశ్చయించి నచో నాదెబ్బకు భల్లాతుఁడు రెండుతుండెము లయ్యెడివాఁడు. ఆదూఁకుట తాను యుద్ధమునకు సిద్ధ మగుట సూచించుట మాత్రమే.

తరువాత నిద్దఱును గత్తియుద్ధ మారంభించిరి. భల్లాతుని ఖడ్గము మయూరుని కొక్కసారి తగిలినను, మయూరుఁడు మఱునిముసముననే మరణించును. కాని మయూరుఁడు ప్రతి ఖడ్గాఘాతమునకుఁ బ్రక్కకు లంఘించి సుళువుగాఁ దప్పుకొను చుండెను. పదినిముసము లైనతరువాత రెండుమూఁడు చిన్న కత్తియొరిపిళ్లు మయూరునకుఁ దగిలెనుగాని, భల్లాతవర్మ చెక్కు చెదరలేదు. మయూరుఁడు పదునొకండేండ్లు నిత్యఖడ్గవిద్య నేర్చెను. శాతవాహన రాష్ట్రములోని ఖడ్గవిద్యానిష్ణాతు లందఱి తోను దాను గత్తియుద్ధము చేసెను. అన్నిచోట్లను గ్రొత్త మెలకువలు నేర్చికొనెను. అతనిముందుఁ గత్తిపూని నిలువఁదగిన వాఁడు శాతవాహనరాష్ట్రములో లేఁడు. అతని కెదురుగాఁ బది నిముసము లిట్లు నిలుచుట, నిలుచుటయే కాదు, భల్లాతుఁడే యధి కుఁడుగా నుండుట మయూరశర్మ కాశ్చర్యము గొలిపెను.

చూచుచున్నవా రందఱకు భయ మయ్యెను. అంత భల్లాతుఁడు తా నొకవిచిత్రమైన కదలికఁ జూపి, మయూరశర్మ నొకతాఁపు తాఁచెను. మయూరునిడాలు భల్లాతుని కత్తియొక్క బలమైన తాఁకుట నాపెను. అయినను, భల్లాతుని ఖడ్గము మయూరుని పార్శ్వమున నినుపకవచములో దూరి బయటకు నెత్తురు వచ్చెను. మయూరునకు మిక్కిలి బాధ కలిగెను. అలిప్తలో మయూరుఁడు సింహ మయ్యెను. మయూరునిప్రకృతి చిత్ర మైనది. వెట్ట తగిలినగాని యతనిప్రతిభ బయటకు రాదు. విద్యాప్రదర్శన నైపుణ్యము మనస్సులోని నిత్యప్రత్యగ్రస్ఫూర్త్యతిశయము చేతఁగాని భాసించదు. అదిమొదలు పదినిముసములు మయూరుని చిత్రచంక్రమణము, కరలాఘవము, చిత్రవిచిత్ర ఖడ్గప్రయోగకౌశల్యము, అఘూతవైచిత్ర్యము భల్లాతవర్మ కన్నులు బైరులు క్రమ్మించెను. అతఁడు తట్టుకొనఁబోయెను. అతని శరీరస్థౌల్య మతనికి నష్ట డిఱకటముగాఁ దోఁచెను. ఈ మయూరుఁడు మనుష్యుఁడు కాఁడు. వీఁ డొకమెఱపుతీఁగ. ఒక మెఱపుతీఁగ కాదు. వందమెఱపుఁతీగలు. భల్లాతుని శరీర మంతయు నెత్తురుకాల్వలు కట్టెను. మఱిపదునిముసములలో భల్లాతుని శరీరము రక్తక్షయమువలన మొదటి జవసత్వము లుడిగిపోయెను. మయూరుఁడు భల్లాతుని కత్తిదెబ్బ తన డాలుతో నాఁచికొని తనకత్తితో భల్లాతుని యెడమమణికట్టు నఱకెను. భల్లాతుని కరతలమును, డాలును బోయి కడిమిచెట్టు మొదటఁ బడెను. అంతయావేశములో మయూరుఁడు విచిత్రముగా నవ్వి యిట్లు కేకవేసెను. 'ఓరి భల్లాతుఁడా! నీచేయి

మాకడిమిచెట్టునకు మొదటిబలి' యని, మఱల యుద్ధము మొదలుపెట్టిరి. భల్లాతుఁడు కవచము తొడిగిన తన యెడమ చేయి డాలుగా మయూరుని కత్తిదెబ్బ లొడ్డుకొనుచు యుద్ధము చేయుచుండెను. భల్లాతుఁ డిట్లనెను. 'ఓరీ బ్రాహ్మణబాలుఁడా! నాశరీరములోని రక్తక్షయమువలన నాదేహమును నీదేహమంత లఘువైనది' యని భల్లాతుఁడు పాము మెలికలు తిరుగువట్లు తిరుగుచుండెను. మయూరుఁడు తన చేతిలోని డాలు గరిడీప్రదేశమున నడుమభాగమునఁ బడవేసి యిట్లనెను, 'నీకు డాలు లేదు. నాకు డాలు లేదు. నీతలనఱకుటకు నేలమోపు చాలదు. ఈడాలు మీఁదపెట్టి నఱకెద' నని యెదిరించెను. వారిద్దఱు రెండు దేగలు. రెండు కాలసర్పములు. ఇంతకుమున్ను వారొకరి నొకరు కత్తులతోఁ గొట్టుకొనుటయే కాని రెండు కత్తిపిఱ్ఱు జేతులతో నడుము కొని ముఖాముఖి నిలిచినది లేదు. ఇప్పు డట్లు జరుగుటలో భల్లాతుఁడు తన మొండిచేతితో మయూరుని తలమీఁద గొట్టెను. ఆదెబ్బకు మయూరుని కన్నులు గిరగిర తిరిగెను. యుద్ధములో నట్లుచేయరాదు. చుట్టుననుండి చూచుచున్న సేనానులకుఁ గోపము వచ్చెను. కొందఱు భల్లాతుని దిట్టిరి. కొందఱు కత్తులుదూసి భల్లాతునిమీఁది కుఱుకఁబోయిరి. కుబ్జుఁడు వారిని వారించెను. లిప్తలో నర్ధభాగమున మయూరుని కనులు తిరుగుట మాని వేసెను. మయూరునకుఁ బట్టరానంత కోపమువేసెను. 'ఓరీ దుష్టుఁడా! ఏమిరా యీ యనీతి' యని మయూరుఁడు కత్తిదూసి కొని యెడమకాలితో భల్లాతవర్మ పొట్టమీఁద దన్ని వాఁడు రెండడుగులు వెనుకకుఁ బోగాఁ గత్తితో వాని యెడమచేయి నఱకెను.

ఎడమచేయి నఱుకఁబడికూడ భల్లాతుఁడు మయూరునిమీఁదికి దూఁకెను. మయూరుఁ డిట్లనెను. 'నీచేతిలోనికత్తి క్రిందఁబడిన తరువాత, నీమెడ నఱుకుట నాకిష్టములేదు. అది నిన్ను వధచేసిన ట్లగును. నీవలెనే నేను దుర్నీతిపరుఁడ నగుదును. ని న్నెట్లు వధించెదనో నీవే చూడు మని నేలపైనున్న డాలునకుఁ జుట్టును దిరుగుచుండెను. ఆడాలు చాల పెద్దది. డాలుమీఁద నడుగు వేయుటకు వీలులేదు. దానినిండ నినుపమేకు లుండెను. ఆచిత్ర మైన తిరుగుటలో నొకసారి మయూరుఁడా డాలును దవకాలితో భల్లాతుని పాదములకుఁ దీవ్రముగా తగులునట్లు తన్నెను. ఆ దెబ్బకు భల్లాతుఁడు శరీరోర్ధ్వభాగము డాలుమీఁదను, నధోభాగము నేలమీఁదనుగా బడెను. మయూరుఁడు క్రిందఁబడిన భల్లాతుని కుడిచేతి మణికట్టుమీఁద నెడమపాదముతో నొక్కి, తన ఖడ్గము భల్లాతుని గొంతుమీఁద నెత్తురువచ్చునట్లు మోపి కుడికాలుతో వాని ఱొమ్ముమీఁద మండిపెట్టి యిట్లనెను. 'ఓయీ తండ్రీ! ఓయమ్మ మాతృదేవత! ఓనా సోదరీ! స్వర్గములో నున్న మీర లీ దుర్మార్గునివధను జూడుఁడు. ఓరీ పశువా, భల్లాతుఁడా! ఇది నీవు సరిగా నాతండ్రిని జంపినస్థలము. సరిగా నిచ్చటనే నిన్ను జంపుచున్నాను. మనుష్యుఁడవై జన్మించి నందులకు మనుష్యుఁడవై బ్రతుకజాలకపోయితి' వని తన కత్తితో వాని మెడ నడ్డముగా నఱకెను. ఆనఱకుటలో భల్లాతుని మెడమీఁదఁ గత్తియానిన భాగముగాక తక్కిన కత్తివాదరతో డాలుమీఁది యా వరుసలోనున్న యినుపమేకులు విఱిగిపోయెను. కత్తివాదర చెడిపోయెను. మయూరుఁ డా కత్తినట్లే వదలిపెట్టెను.

150

# సప్తదశాధ్యాయము

పల్లవచక్రవర్తి శివస్కంధవర్మ కాంచీనగరములో రాజభవనములో విశ్రమించియుండెను. నాగన్న వింజామర వీచుచుండెను. అప్పుడు బుధ్యంకరమహాసేనాపతి దర్శనమునకు వార్తనంపెను. చక్రవర్తి రమ్మనెను. బుధ్యంకరుఁ డిట్లనెను. 'మహారాజ! భల్లాతవర్మయొక్క పదునేనువేల పదాతులు, వేయి యేనుఁగులు, రెండువేల గుఱ్ఱములలో నేమియు మిగుల లేదు. బ్రతికిన మూఁడువందల యేనుఁగులు మయూరుని యధీనమయ్యెను. ఇప్పుడు మయూరుని యశ్వసైన్యము మూఁడువేలు. మనసైన్యములో మూడుఁవేలమంది తిరిగివచ్చిరి. నిరాయుధులు నిర్వస్త్రులై స్వప్నములోఁగూడ మయూరునిపేరు విన్నచో నులికిపడి లేచుచుండిరి. భల్లాతవర్మ వధవృత్తాంతము ప్రభువులకిదివఱకే మనవిచేసితిని'. చక్రవర్తి యీ మాటలు విని 'మహాసేనాపతీ! యిందులో మయూరుని యన్యాయ మేమున్నది? అంతటి ఖడ్గవిద్యానిపుణుని భల్లాతవర్మను, మయూరుఁడు గెలువవద్దనెనా? గెలిచి శాతవాహన రాష్ట్రమునకు రాజు కావద్దనెనా? అతఁడు చేసినదానిలో నాకు దోషము కనిపించుట

లేదు. అయినను నతఁడు మనరాజ్య మాక్రమించు కొనెను. అతనికి మాయందు మిక్కిలి గౌరవమున్నట్లు వినుకలి. మనము పోయి వానిని బ్రతిమాలుట న్యాయముకాదుగదా! మఱి యేమి చేయవలయును?' సేనాపతి యిట్లనెను. 'ప్రభువుల యాజ్ఞ యైనచో నేఁడు దండెత్తిపోయెదను. అతఁడు ప్రభుభక్తి కలవాఁడో, కాఁడో, తెలియునుకదా!' చక్రవర్తి యిట్లనెను. 'అతఁడు శాతవాహనరాష్ట్రమును దిద్దిన దిద్దుబడికి దండెత్తి పోయి ఏమిలాభము? ఒక లక్షసైన్యముతో దండెత్తిపోయినచోఁ బోవలయును. లేనిచో నిష్ప్రయోజనము' అనఁగా మహా సేనాపతి 'ప్రభూ! నాపేరు బుధ్యంకరుఁడు. అయిదువేల సైన్యముతోఁబోయి మయూరుని గెలిచివచ్చెదను. బృహత్పలాయనుల గతి యేమియైనది?' చక్రవర్తి మాఱుచెప్పలేదు.

ఏనుఁగులు లేవు, గుఱ్ఱములు లేవు. అయిదువేలమంది పదాతులతో బుధ్యంకరుఁడు తనమీఁదికి వచ్చుచున్నాఁడని మయూరుఁడు విని యాశ్చర్యపోయెను. అంతటి సైన్యముతో భల్లాతుఁడెందుకుఁ గొఱగాకుండ బోయెను. ఈమహాసేనాపతి సాహసమేమి? మయూరునకుఁ దన బాలయోగివేషమునాఁటి కథయంతయు జ్ఞాపకము వచ్చెను. తన యుద్ధనీతియంతయు బుధ్యంకరుఁడు నేర్పిన దనిపించెను. మయూరుఁడు కుబ్జునితో నీసంగతిఁ జెప్పెను. కుబ్జుఁ డిట్లనెను. 'నీభయమేగాని, బుధ్యం కరుఁడు నిన్నుగెలుచుటకు వచ్చుటలేదు. నీతో మాటాడుటకు వచ్చుచుండెను. అయిదువేల సైన్యమును బరివారముగాఁ

దెచ్చుచుండెను.' అనఁగా మయూరుఁడు, 'మయూరుఁడే బాల యోగి యని యాయనకుఁ దెలియ'దనెను.

బుధ్యంకరుఁడు మయూరుని స్థానాకోడూరునందలి యునికిఁ దెలిసికొని తన సైన్యముతో నాదుర్గమునకుఁ గొంత దవ్వున విడిసెను. బుధ్యంకరుని సైన్యము యుద్ధమునకు వచ్చి నట్లు లేదు. ఒకనాఁడు ప్రొద్దుట నొకబాలయోగి బుధ్యంకరుని దర్శనమునకుఁ బోయెను. బుధ్యంకరుఁ డిట్లనెను. 'ఏమయ్యా, బాలయోగి! మనస్సు చలించి నిష్ఠ కుదుర లేదంటివి. ఇప్పుడు కుదిరినదా' యని.

బాలయోగి యిట్లనెను. 'మహాసేనాపతీ! కుదిరినది. కాని, మఱలవచ్చి తమయింట నా యాఱునెలల వ్రతము నీ సారి నిర్విఘ్నముగాఁ గొనసాగింపవలయు నని యున్నది. మీ యాజ్ఞయైనచో వచ్చెద'నని.

మహాసేనాపతి లేచి బాలయోగిని గౌఁగిలించుకొనెను. కౌగిలించుకొని యిట్లనెను. 'నాయనా! నాకఱువదియేండ్లు. నారక్తమాంసము లన్నియుఁ బల్లవచక్రవర్తుల సేవలో నింకి పోయెను. నీ వెఱుఁగుదువుకదా! నాకు సంతానములేదు. నాకు గొడుకున్నచోఁ జక్రవర్తి వానినే మఱల మహాసేనాపతిని జేయును. నీవే నాకుమారుఁడవు. భల్లాతవర్మను నీవు విఱుగఁ బొడిచితివి. బృహత్ఫలాయనులను నీవు లొంగదీయుటలో చక్రవర్తి బొక్కసము, చక్రవర్తి సైన్యము మిక్కిలి చెల్లాచెద రైనవి. ఆనందులు చక్రవర్తినింకను నెదిరించుచునేయున్నారు.

నీవంటివాఁడు మహాసేనాపతిగా లేనిచోఁ బల్లవరాజుల చక్ర వర్తిత్వము నిలువదు.'

తరువాత బదిదినములకు మయూరుఁడు, బుధ్యంకరుఁడు పదివేల సైన్యముతో, వేయి గుఱ్ఱములతోఁ గాంచీనగరము పోయిరి. చక్రవర్తి మయూరునిజూచినంతనే మొగము ముడుచు కొనెను. మిక్కిలి కోపించెను. మయూరునితోఁ గొంచెము నిందగా మాటాడెను. నీవు బుధ్యంకరుని దత్తపుత్రుఁడవు గనుక నిన్ను మహాసేనాపతిగా నియమించుచున్నాను. వేఱొక కార ణములేదు. నీవు మారాజ్యమునకుఁ జాల ద్రోహము చేసితివి. మాకుఁ బ్రియతముఁడైన భల్లాతవర్మను సంహరించితివి. దానిని మేము జీవితములో మఱచిపోలే' మనెను. పసివాఁడైన మయూరశర్మ మనస్సు కలుక్కుమనెను. తరువాత బుధ్యంక రుఁడు చెప్పెను. 'నాయనా! చక్రవర్తికి నీమీఁద మిక్కిలి ప్రేమ. నీశౌర్యపరాక్రమములు, నీన్యాయబుద్ధి, చక్రవర్తి యెంతయైనను మెచ్చుకొనును. అది మహారాజలక్షణము. వారు మనసులో నున్న ప్రేమ, చప్పున వెలికిఁజూపించ'రని. కాని తొలి యౌవ నములో నుండి పందొమ్మిదియేండ్ల వయసునాఁటికిఁ దనయంతటి మహాకార్యములు చేసిన యహంకారము గల మయూరునకుఁ జక్రవర్తిమాటలు రుచింపలేదు. బుధ్యంకరుని సమాధానము నచ్చలేదు. మయూరుని హృదయములో నేమూలనో యీ భావము చివరిదాఁక నుండెను.

వెంటనే బుధ్యంకరుఁడు తాను మహాసేనాపతి ధర్మము నుండి విరమించెను. మయూరుఁడు మహాసేనాపతి యయ్యెను.

తరువాత నాల్గేండ్లలో బుధ్యంకరుఁడు తన సర్వస్వమునకు మయూరుని సర్వాధికారిని జేసి ప్రాణములు వదలెను. మయూరుఁడు తరువాతఁగూడ నాతేండ్లవఱకుఁ బల్లవచక్రవర్తుల మహాసేనాధిపతిగా నుండెను. ఉన్నను మయూరుఁడు సంవత్సరమునకు మూఁడునెలలు కాంచీనగరములో నుండును. తక్కిన తొమ్మిదినెలలు వైజయంతిలో నుండును.

క్రమముగాఁ బల్లవచక్రవర్తుల బలము తగ్గిపోఁజొచ్చెను. ఒక్క మయూరుఁ డేమిచేయఁగలఁడు? శాతవాహనరాష్ట్ర ప్రజలతోఁ బల్లవరాజ్యమును రక్షింపవలయు నని మయూరునకు లేదు. అతఁడు చక్రవర్తిని వదలిపోయెను. తన రాష్ట్రములో దాను స్వతంత్రరాజయ్యెను. పడిపోవుచున్న చెట్టు నాశ్రయించికొని యున్నందువలనఁ బ్రయోజన మేమి?

---

## పరిసమాప్తి

మయూరశర్మకుమారుఁడు ఖంగవర్మ. ఆయనకొడుకు భగీరథుఁడు. భగీరథున కిద్దఱు కుమారులు. పెద్దవాఁడు రఘువు, రెండవవాఁడు కాకుత్సుఁడు. కాకుత్సునకు గుమారుఁ లిద్దఱు. ఒకఁడు శాంతివర్మ, రెండవవాఁడు కృష్ణవర్మ. శాంతివర్మకుమారులు మృగేశవర్మయు, దేవవర్మయు, విష్ణువర్మయు. మృగేశవర్మకుమారుఁడు రవివర్మ. రవివర్మ కుమారుఁడు హరివర్మ. విష్ణువర్మ కుమారుఁడు సింహవర్మ. అతనికొడుకు

రెండవకృష్ణవర్మ. వాని కుమారుఁడు అజవర్మ. అజవర్మ కుమారుఁడు భోగవర్మ.

మయూరుఁడు క్రీస్తుశకము మూఁడువందలపదిలో రాజయ్యెను. భోగవర్మ క్రీస్తుశకము అయిదువందల తొంబదియైదు వఱకు రాజ్యముచేసెను.

ఈకడిమిచెట్టు రెండువందల యెనుబదియేండ్లు శిశిర ఋతువున నాకు రాలుచుండెను. వసంతర్తువున, జిగిరించుచుండెను. గ్రీష్మమున ఫలించుచుండెను. వర్షర్తువునఁ గ్రొత్త పూఁతపూఁచి, యాపుష్పములురాలి యాపూఁదావి వాన నీటిద్వారా చుట్టునఁ గందకముగానున్న వాఁగులోనికిఁ బోయి, స్థానాకోడూరుదుర్గమున నిరువైపులనున్న మహాసరస్సులలోని జలమంతయు సువాసనా భరితము చేయుచుండెను. ఆకదంబ వృక్షమధురవాసనాలహరి శాతవాహనరాష్ట్ర ప్రజలను బురుష మూర్తులుగాఁ జేసెను. శాతవాహనరాష్ట్రమున దుర్గాదేవి, పరమేశ్వరి, వృషభవాహనుని యిల్లాలు, కదంబవనవాసిని మూఁడు వందలయేండ్లు నివసించెను. ఆజగజ్జననికి స్థానాకోడూరులో మయూరుని యింటిపట్టుననున్న కడిమిచెట్టుక్రింద భల్లాతవర్మ చేయి తెగిపడినచోటఁ బ్రతి యాశ్వయుజమాసమునందు మూఁడు వందలయేం డ్లవిచ్ఛిన్నముగా దేవీవిగ్రహము స్థాపించి నవ రాత్రోత్సవములు జరుపఁబడుచుండెను. తల్లి కంటిచూపు కడిమి పూచిన ట్లుండెను. తల్లిచిరునవ్వు కదంబతరు నిర్యాసమువలె నుండెను. తల్లి బాహులతిక కదంబశాఖవలె నుండెను. తల్లి కట్టినచీర కడిమిచెట్టు నిండుగాఁ జిగురు తొడిగిన ట్లుండెను.

తల్లి కైలాసమువదలి యా పర్వతము మీఁద దేవతాస్త్రీలు సేవించుచుండఁగా నచటి కడిమితోటలలోని విహారము మాని వేసి స్థానాకోడూరులో మయూరుని యింటివద్దనున్న కడిమి చెట్టుక్రింద నివసించెను. మూఁడువందలయేండ్లు పెట్టిన కాలు కదుపలేదు.

కుబ్జుని యశోగీతములు దశదిశాపరివ్యాప్తము లయ్యెను. కాదంబులు మానవ్యగోత్రు లఁట. హారీతపుత్రు లఁట. శతాశ్వ మేధు లఁట. ఆ కవికల్పన కంతులేకపోయెను. ధర్మరక్షణచేసిన రాజును గవి తన యిష్టమువచ్చినట్లు వర్ణించును. అవి లౌకిక ముగా నబద్ధములు. ధార్మికముగా యథార్థములు. సర్వధర్మము రసమయము. రస మనఁగా హృదయగతసమార్ద్రి మధుద్రవ స్పందనము. ఆస్పందనము కల్పించిన కవికంటె యదార్థవాది యెవఁడు ?

కుబ్జుఁడట్టి మహాకవి. కుబ్జుఁడు తనగీతము లా కడిమి చెట్టుచుట్టు నల్లెను.

MRN...

నాగార్జున ప్రింటింగ్ వర్క్సు: కాచిగూడ, హైదరాబాదు.

